29

సాహసవిక్రమాంకుల



సాహసకథలు

# ఏరికోరి వలసవచ్చిన అమెరికన్లు

మూలం:

ఏంజిలో పెల్లిగ్రినీ

అనువాదం:

రామలక్ష్మి ఆరుద్ర

యం. శేషాచలం అండ్ కో

మద్రాసు : మచిలీపట్టణము : సికింద్రాబాదు.

Published by :
M. Seshachalam & Co.,
Madras : Masulipatam : Secunderabad

Printed at the
Weldun Press,
Madras - 21.

**Price : Rs. 2-00**




ఇంటింటా స్వంతగ్రంథాలయం ప్రణాళి
చందాదారులకు ప్రత్యేక ప్రచురణ

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు
రాష్ట్రపతిరోడ్డు :: సికిందరాబాదు

# ముందుమాట

మేం ఆరుగురం : ఐదుగురు పాత్రధారులు; ఒకరు ప్రయోక్త. కాని ప్రయోక్తకూడ పాత్రధారుల్లో ఒకడే. మేం స్త్రీపురుషులం. మేం ఎంత అసామాన్యులైన స్త్రీపురుషులం అంటే, మాలాంటి వారిని గురించి మీరు వినివుండరు. కాని, మేంగాని మీకు తెలిసిన ఎవరినేనా జ్ఞప్తికి తెస్తే, మీ రూహించిన ఎవరినేనా, లేక మీరు విన్న ఎవరినేనా గుర్తుకు తెస్తే...దానికి కారణం; మేము అంత అసాధారణులంకూడ కాదు.

మా కథా కొత్తది కాదు. కొత్తది అయితే చెప్పడానికి జంకేవాళ్లం. కథ అన్నది ఎంత పాతది అయితే అంత బాగుంటుంది చెప్పడానికి. మేం అమెరికనులం. జన్మతహా కాకపోయినా, ఏరికోరిన అమెరికనులం. వాంఛించిన అమెరికనులం. ఎక్కడో వున్న మా జన్మస్థలంనుంచి అమెరికాకు వచ్చాం. అమెరికా మమ్మల్ని తనలో యిముడ్చుకుంది; శ్రమించి పనిచేయించింది; భవిష్యత్తు సృష్టించుకొందుకు అవకాశం యిచ్చింది. మాలో ఓడినవారిని క్షమించాలి. ఎక్కడైతే బలిష్ఠంగా వుండాలో అక్కడే బలహీనులం అయాము. మేం యిలా వున్నందువల్లే—మా కథ లింకో ప్రదేశంలో అసంభవాలు. మా సామాన్యకథ అమెరికా కథలో విభాగమే.

మేం దేన్నుంచి తప్పించుకున్నాం ? అలా సంపాదించిన స్వేచ్ఛతో ఏం చేశాం ? మా కష్టసమయంలో మమ్మల్ని ఆదుకుని తిన డానికి తిండీ, కట్టబట్టా యిచ్చిన అమెరికాకు మేం ఏవిధంగా కృతజ్ఞత చూపాం...యీప్రశ్నలు హృదయాంతరాళాలను తాకుతాయి. దీనికి సమాధానం చెప్పడం మాతరంకాదు; యీగ్రంథంలో పొందుపరచిన మా కథలను మీరు చదువగలితే అవే మీకు సమాధానం చెపాయి.

# విషయానుక్రమణిక




1. రైతుతల్లి లాబింబినా 1

2. కాలువలుతవ్వే లియోనార్డో 19

3. ద్రాక్షపంటల తల్లి రోజామాండవీ 61

4. ద్రాక్షతోటగాళ్ల గురువు లూయీ మార్టినీ 76

5. దొంగసారా వ్యాపారి గ్యాడో సెల్లా 100

# 1

## రైతు తల్లి

## లా బిం బి నా

అక్టోబరు 15,1948 నాడు ఆమెయింటి ముందునుంచి ఎవరు వెళ్ళినా, సాయంత్రం ఐదుగంటల వేళ, తోటలో పనిచేసుకుంటూన్న ఆమెను చూడగలిగేవారే! పొందికగా వున్న ఆమె నడుం కొంచెం వంగింది వయస్సుతో, తెల్లబడిన జుట్టు చక్కగా దువ్వి చిన్న ముడి చుట్టివుంది; ఎన్నోసార్లు వుతకడం వల్ల వెలిసిన చొక్కా ధరించివుంది. ఉత్తర పశ్చిమ ప్రాంతాలలో అక్కడక్కడ చెల్లాచెదరుగా వున్న ఆమెపిల్లలు, మనుమలు, మునిమనుమలకోసం వెల్లుల్లి నాటడం అప్పుడే ముగించింది ఆమె. తొలి ప్రపంచ యుద్ధ ప్రారంభంలో తొలిసారిగా అమెరికాలో యింటికి తన పిల్లలను తీసుకువచ్చింది. ఆ యిల్లు వదిలి అప్పుడే పిల్లలంతా చెల్లాచెదరుగా విస్తరించారు.

వారి కంకా అవసరం లుంటాయని యీామె చేసే చిన్నిచిన్ని పనులలో యీా పని ఒకటి.

ఎన్నో సంవత్సరాల తరబడి సారవంతం చేసిన నల్ల మట్టి నేలలో వరసలుగా నాటిన వాటిని చూసి, సన్నగా నవ్వుకొంంది. ప్రతీసారీ వచ్చినట్టే పిల్లలు తిరిగి తమతమ యిళ్లకు వచ్చితీరతారు; అమ్మతోటలో పువ్వులు, వెల్లుల్లి యింకా ఏం నచ్చితే అవి తీసుకుని తమ స్వగృహాలకి వెడ తారు. 'వస్తున్నాం' అని చెప్పకుండానే వచ్చేస్తారు; తరుచు కూడ వస్తారు. ఆమెకి తెలుసు: తనకీ వారికీ ఏదో విడని బంధం వుంది. ఈ తొలి యిల్లు అయిన చిన్న నేలకీ, వారికీ అలాంటి బంధం వుంది.

రైతులందరికిలాగే ఆమెకీ తొలికారు అంటే అభి మానం. నాటడం, పంట కోయడం ద్విగుణీకృతం అయిన ఆనందాన్ని యిస్తాయి. గత యాభై సంవత్సరాలుగా తోటలోపండించి అదికోసి యింట్లో అల్మారాలు నింపుతూంది ఆమె. ఆ కోసిన పంటనేలలో-గ్రీష్మపు తొలివెల్లులలో... వెల్లుల్లి, బఠాణీ, చిక్కుడు మొదలైన ఎన్నోరకాల కూర గాయలు నాటి-అన్నీ కోతకి సిద్ధంచేసేది వసంతంలో.

సంవత్సరాలు గడుస్తూన్నకొద్దీ గ్రీష్మపు తొలి రోజులు ఎక్కువ అర్థవంతం కాసాగాయి యీామెకి. చాలా సంవత్సరాల క్రిందట యీాయింటికి పునాదివేసిన ఆమెభర్త ఒక ఏపిల్ చెట్టు, పియర్సుచెట్టు, రెండు ఇటాలియన్ ప్లమ్ చెట్లూ నాటాడు. ఆ చెట్లు బాగా పెరిగి పెద్దవయి మంచి

పంట నిస్తున్నాయి. చాలాకాలం క్రిందటే చనిపోయిన తన భర్త యీ చెట్లని ఎంత మక్కువగా చూసేవాడో, వాటి తొలిపంట చూసి ఎంత గర్వించాడో జ్ఞాపకం వచ్చిందామెకి. చనిపోయిన భర్త యింకా ఎన్నో వదలిపోయాడు. కాని ఆమె కీ చెట్లే ఎంతో యిష్టం. ఇవే అతని కీ కుటుంబంపై వున్న మక్కువకి నిలిచిన చిహ్నాలు. అందుకే యీ పళ్లు పండి, కోసే కాలంకోసం ఎంతో ఉత్సాహంతో ఎదురుచూసి, పంట దింపగానే పిల్లలందరికీ దాన్ని సమానంగా పంచేది. ఇదంతా ఓ పండుగలాగ జరిపించటం అలవాటై, ఎన్నోవందల మైళ్ళ దూరంనుంచి కూడ యీపంట టైముకి పిల్లలంతా యిల్లుచేరేవారు. ప్రతి వేసవి చివరపడుతూంటే "అమ్మా, పళ్లు ఎప్పుడు పంటకి దిగుతాయో చెప్పు" అని వేసే వారి ప్రశ్నకూడ ఆమెకు అలవాటైపోయింది.

ఈరోజు సాయంత్రంకూడ తన తోటలోని కూరలు కోసి పులుసు కాచుకుని, యింట్లో కాల్చిన రొట్టెలు అద్దుకు తింది. వంటిల్లు చక్కపెట్టి, కొద్దిదూరంలోనే వున్న సోషల్ క్లబ్బుకి నడిచి వెళ్ళడానికి బయలుదేరింది. దారిలోనే పొరుగింటాయిన – పెయిట్రో ఫోర్నిలి ఆవుని తోలుకుంటూ ఎదురయాడు. "ఏం బింబినా, చర్చికి వెళ్ళడానికా చక్కగా బయలుదేరావు?"

"ఓ, చాల్లే పెయిట్రో, నీ వేళాకోళం! పల్లెలో నా స్నేహితుడు నిరీక్షిస్తూవుంటా డన్నది అందరికీ తెలిసిన సంగతేగా?"

...ఆ రాత్రి తొమ్మిదీ పదినిముషాలకి క్లబ్బులో సభ ముగియవచ్చిన క్షణంలోనే లా బింబినా హఠాత్తుగా, హాయిగా, సులభంగా కళ్లు మూసింది—ఒక సభ్యురాలి చేతుల్లో.

ఆరోజు పని ముగిసినతరువాతనే మృత్యువు తాకింది లా బింబినాని—అదే ఆమెకు తగిన పద్ధతి.

డెబ్బయినాల్గు సంవత్సరాలు బ్రతికిన లాబింబినా ఎన్నో దేశాలలో వుంది. ఆరుగురు పిల్లల తల్లి. ఆరుగురికీ పెళ్ళిళ్లు చేసింది. ఎవరింటిలో వారిని స్తిమితపరిచింది. తన పిల్లలు ఆనందపడిన యిటాలియిన్, ఫ్రెంచి పాటలు తన పదహారుగురు మనమలకీ, మునిమనమలకీ చెప్పించి ఆనందించింది.

తన తుదిఘడియలదాకా శ్రమిస్తూనే వుంది లా బింబినా. "చదువులేని మనబోటివారికి చేతుల్లో తెలివితేటలుండాలి" అన్న యిటాలియిన్ నానుడికామె ప్రత్యక్ష నిదర్శనం. ఆమె హస్తాలు చిన్నవే. కాని బలిష్ఠంగా, మొద్దుబారిన చర్మంతో వుండేవి. ఎన్నడూ సోమరితనం ఎరుగని చేతు లవి. నూలు వడికాయి; బట్ట నేశాయి; తోటలో పని ముట్లు పట్టుకున్నాయి; తవ్వాయి; నాటాయి; పార నెలా పట్టాయో, గునపా న్నలాగే పట్టాయి; ద్రాక్ష కోశాయి; సారా జాగ్రత్తచేశాయి; బట్టలు వుతికాయి; టన్నులకొద్దీ రొట్టె కాల్చాయి; ఎన్నో నేలలు కడిగాయి; ఎన్నో చక్కని వంటలు వండాయి...చివరి కీనాడు విశ్రాంతి తీసుకుందుకు

నిశ్చయించాయి—ఒకదానితో ఒకటి ముకుళితం అయి మృత్యువు నాహ్వానించాయి. సంప్రదాయికంగా అలాగే వుంచుతారు చనిపోయినవారి చేతులని.

గతశతాబ్దపు తొలిమలుపులో ప్రపంచపు ఒత్తిడి ప్రదేశాలలో దారిద్ర్యాన్ని వదలిన చాలామందిలో లా బింబినా ఒకతె. చేయడానికి పని, శాశ్వతమైన యిల్లు దొరుకుతా యన్న నమ్మకంతో అంతా అమెరికాకు వచ్చారు. కొందరికి తా మెదురుచూసినదానికంటె ఎక్కువే దక్కింది. లా బింబినాకు పని, తద్వారా సంతృప్తి లభించాయి.

ఇటలీలోని టస్కనీప్రాంతంలో ఓ చిన్నపల్లెలోని స్వస్థలాన్ని వదిలి, వాషింగ్టన్ రాష్ట్రంలో ఒక పల్లెలో వున్న తన భర్తదగ్గరకి వచ్చిచేరడం అంత సులువైన ప్రయాణం కాదు లా బింబినాకి. పదిహేను, మూడు సంవత్సరాల మధ్యవయస్కులైన ఐదుగురు పిల్లలను వెంటబెట్టుకుని వచ్చింది. అట్లాంటిక్ మీద ప్రయాణం, తుఫాను ప్రాయంగా, భయంకరంగా, నీరసింపజేసేదిగా తయారైంది. పాత పడవ ఒకదాన్లో క్రిక్కిరిసిన మనుషులమధ్య పడి పంధొమ్మిది రోజులు ప్రయాణం చేసిన తరువాత అమెరికా వచ్చిచేరగలిగారు. దాని తరవాయిగా, దారీ తెన్నూ తెలియని ప్రయాణం...ఖండానికి అడ్డంగా ప్రారంభంఅయి—మైదానాలు, పర్వతశ్రేణులు, నదులు దాటుకుంటూ ఆరురోజులపాటు ముక్కూ ముఖం తెలియనివారి మధ్య, భాషైనా తెలియనివారి మధ్యనుంచి ప్రయాణం సాగించింది.

ఆమెభర్త తయారుచేసిన చిన్నయిల్లూ, ఆ పరిసర ప్రాంతాలూ ఇవన్నీ అమెరికా అంటే కలలుగన్నవారికి అంత ఆశాజనకంగా తోచవు. అమానుషం, ఆటవికం అయిన ఏదో తత్వం గోచరిస్తుం దా ప్రాంతాలలో. దాన్ని చూస్తూంటే వరుసగా తిరిగే తెగలవా రెవరో అవసరార్థం సృష్టించుకుని, ఆ అవసరం తీరగానే వెళ్ళిపోయిన ప్రదేశం లాగ తోస్తుంది. ఒకేసారి అతిప్రాచీనంగానూ, అతికొత్తది గానూ కనిపిస్తుంది. పెరటిగుమ్మంవైపు అడవి, అందంగా లేని యిళ్ళు, గడ్డితో నిండిపోయిన రోడ్లు, దారులు అన్నీ ఇటాలి యన్ పల్లెటిప్రాంతానికి తలక్రిందులు. ఆక్షణంలో యీ కొత్తదేశం అసలుదేశంకంటే బీదస్థితిలో వున్నట్టు కన్పిస్తుంది.

కాని లా బింబినా మటుకు త్వరలోనే యిక్కడి అవ కాశాలను గుర్తింపగలిగింది. ఈ కొత్త పరిసరాలు శ్రమిం చడానికి చక్కటి అవకాశాలు. దార్లు సరిచేసుకోవాలి. గుమ్మాలమీదనుంచి గడ్డి తీసివేయాలి. కర్రతో ఆదరబాదరగా కట్టినట్టున్న యిళ్లు-ఎంతో వుంది. ఇక్కడి మనుషులకు పనిచేయడం కన్న చూసిన పనికి శాశ్వతమైన ఫలితం వుండాలన్నదిగాని తోచినట్టు లేదు. లా బింబినాలో పునా దుల్లోవున్న గుణాలు. అందుకే యీ నూత్న వాతావర ణాన్నీ, యింటినీ ఎంతో కృతజ్ఞతతో స్వీకరించింది.

పనిచేసే దుస్తులను ధరించి పనిలోకి దిగింది. ఒక్క సంవత్సరం గడిచేసరికి, తనంభర్త సంపాదన కంటె ఆమె

యింటికిచ్చినదే చాలా ఎక్కువ. పెరట్లో ఆవులు, పందులు, కోళ్లు, చెవులపిల్లులు ఎన్నో వున్నాయి. ఈ యింటి పక్కనున్న భూమి–ఎవరూ తాకనిది—యింటికీ, పెరట్లో జంతువులకీ కావలసినంత ఆహారపదార్థం పండిస్తూంది. ఎక్కువైన పాలు, గుడ్లు, కోడిపిల్లలూ అప్పుడప్పుడు పల్లెలోని వారికి అమ్మడం జరిగేది. అప్పుడప్పుడు స్థానికంగా వున్న ఒక కొట్లో మాంసం యిచ్చి కావలసిన యితర వస్తువులు తెచ్చుకోవడం జరిగేది. బ్రహ్మచారులు బ్రతిమాలి ఆమె యింట్లో దిగేవారు. తమ కిచ్చే చక్కని భోజనానికి తగినంతగా ఖరీదు ఇచ్చేవారు. ఇలా యింట్లోకి రానివారు ఆదివారంనాడు భోజనానికి రావడంతో సంతృప్తిపడేవారు; అలాగే తమ బట్టలు వుతికించుకుని యిస్త్రీ పెట్టించుకునేవారు.

ఈపని అంతా లా బింబినా ఒక్కర్తే చేసేది. ఆమె భర్త–వాతావరణం బాగున్నా, లేకపోయినా–రోజుకు పది గంటలపాటు కలపక్యాంపులో పనిచేసేవాడు. ఎప్పుడేనా సాయంచేసినా, ముఖ్యమైన పనిఅంతా లా బింబినా మీదా, పిల్లలమీదానే పడేది. పిల్లలచేత ఎలా పనిచేయించడమో లా బింబినాకి బాగా తెలుసు.

"స్కూలునుంచి తిన్నగా యింటికి రావాలి. లేకుంటే తోలు ఒల్చేస్తాను" అనేది.

ఎంతో కోపంగా యిచ్చే యీ హుకుములు పిల్లలమీద బాగా పనిచేసేవి. అందుకే బాగా చిన్నవయస్సులోనే యిద్దరు కొడుకులూ బాగా రొట్టె కాల్చడం తెలుసుకో

గలిగారు. అది చాలా విలువైన విద్య. తోటలో పనిచేసే వారు. కర్ర చేరవేసేవారు. జంతువులని శ్రద్ధగా చూసే వారు. ఎక్కువైన పదార్థాలు అమ్మేవారు. ఆడపిల్లలుకూడ చాలా కష్టపడి పనిచేసేవారు. ఆపనికి అంతుండేది కాదు. న్యాయానికి అంత చేయించనేకూడదు. కాని పనిచేయాలి. తప్పదు. అలాకాని ఎన్నో సంవత్సరాల దారిద్ర్యం తొలగించడం జరగదుకదా.

శ్రమించి పనిచేసే ఉత్సాహంతోనూ, రైతులందరికీ అలవాటైన భవిష్యత్తు అంటే భయంవల్లనూ లా బింబినా పిల్లలచేత విపరీతమైయిన పని చేయించింది. దానికి తరువాత ఆమె బాధపడింది. పశ్చాత్తాపపడింది. ఆ పిల్లలుకూడా మామూలువాళ్ళలాగ కాకుండా ఎంతో యిష్టంగా పనిచేసే వారు. దానికి కారణం? వారందరూకూడ ఫలవంతంకాని చాకిరీ, భూవసతి లేకపోవడం అన్నది స్వంతవూళ్లో చూశారు. ఇక్కడ కొత్త యింటిలో శ్రమ ఫలిస్తూంటే, కళ్లకి కనబడుతూంటే ఆసక్తితో పనిచేసేవారు. అక్కడక్కడ వున్న ఏపిల్, పియర్సు చెట్లనుంచి సంచులకొద్దీ పళ్లు ఏరుకొచ్చేవారు. చెట్లూ చెదారం కోసి చెవులపిల్లులకి మేత వేసేవారు. అక్కడక్కడ ఏరిన కాళీసీసాలు అమ్మేసేవారు.

చుట్టుపక్కల చేజిక్కిన అవకాశాలు ఉపయోగించుకుంటూ చిన్న సైనికులలాగా పనిచేసేవారు. అయినాకూడ వారు పిల్లలేకదా. తల్లికనుక కొంచెం కఠినం తగ్గించినా,

జోరు తగ్గించినా, తమ యిరుగుపొరుగువారి పిల్లలలా సులభ జీవితానికీ, నిర్లక్ష్యానికీ బానిస లైపోయేవారే!

ఆమె యిటాలియన్ స్నేహితులు ఒక్కమాటలో యీామెగుణాలనన్నీ వర్ణించి 'బింబినా' అని పిలిచేవారు. టస్కనీలో 'బింబినా' అంటే 'చిన్నదానా,' అని అర్థం చెప్పుకోవచ్చు. ఈపేరు సరిగ్గా తగి, యీామెఉత్సాహానికీ, జీవితంపై అభిమానానికీ, నిరాడంబరతకీ, సంఘజీవితాభిలాషకీ చిహ్న అయింది. అందుకే యౌవనులంతా కూడేచోట యీామెని తప్పక ఆహ్వానిస్తూండేవారు.

ఇక కొద్దిమాసాలకి చనిపోతుందనగా ఒక మనవడి పెళ్లిసందర్భంలో యిచ్చిన విందులో ఆమెను చూడడం తటస్థించింది. వధువు తలిదండ్రుల యింటిలో ఇటాలియనుసంప్రదాయసిద్ధంగా జరిగిన తతంగం యిది. వచ్చిన అతిథులంతా కుటుంబాలతో వచ్చారు. అది యిటాలియన్ ఆచారం. ఆగదిచుట్టూ ఆడవారూ, మగవారూ, పిల్లలూ అంతా కూర్చుని వున్నారు—ఏం చెయ్యాలో చెప్తే విందాం అన్నట్లు.

అతిథులంతా గదిని కలయజూస్తున్నారు. చక్కగా మెరిసే నేల, ఖరీదైన వస్తుసముదాయం, మూవీకెమెరా, దాన్ని తిప్పే మనిషి, అక్కడున్నవారికి సరిపడేదానికి రెట్టింపుగా అమర్చివున్న ఆహారపదార్థాల బల్లలు, సంగీతం పాడేవారు—అంతా నిశ్శబ్దంగా కూర్చుని, చిరునవ్వులతో పల్కరించుకుంటున్నారు. అప్పుడే—పాటలకీ, నృత్యానికీ, నవ్వులకీ ఆహ్వానం వచ్చింది.

లా బింబినాకు తెలిసిన కొందరు 'యీ విందు ప్రారంభించడానికింకా ఎంతసేపు పడుతుంది? ఏం చేస్తుంది?' అని ఆలోచిస్తున్నారు. కాని ఎంతోసేపు ఎదురుచూడవలసిన పని లేకపోయింది. ఈ నిశ్శబ్దాన్ని భరించలేక... హాలులో అడ్డంగా నడిచివెళ్ళి, వాద్యగాళ్ళతో సంభాషించి, పాతకాలపు ఇటాలియన్ ప్రేమగీతం ఒకటి పాడ్డం ప్రారంభించింది. చిన్నలూ పెద్దలూ ఆ పాట అందుకున్నారు. ఆమె కొడుకుతో నాట్యం చేయడం ప్రారంభించింది. దాన్ని మిగిలిన అందరూ అందుకున్నారు. తీక్షణంగా, సీరియస్‌గా వున్న ముఖాలు వికసించాయి. తెల్లవారుఝాము మూడుగంటలదాకా ఆనందం రాజ్యం చేసిం దక్కడ.

ఉత్సాహపూరితమైన యీమె ప్రఖ్యాతి చక్కని పూలవృక్షంలా వికసించింది అమెరికాలో. జనాభా ఒత్తిడితో సతమతమయిన యిటలీలోని అనుభవానికీ యిక్కడికీ తేడాకి కారణం యిదీ. ఇక్కడ ఎవరికైనా పనిదొరుకుతుంది.

తన కుటుంబఅవసరాలకు కావలసిన పనికోసం గాలించింది. అది దొరికింది. అదే ఆమెజీవితానికి ముఖ్యలక్ష్యం అయింది. ఈమెను బాగా అర్థంచేసుకోవడమే ఒక కొత్త అనుభవం. ఏపల్లెకైతే సరికొత్తగా వచ్చిందో అదేపల్లెలో మనుష్యుల విలువ గుర్తించేలా చేసింది. ఈ పల్లెప్రజలు యీమెను మరిచిపోలేరు.

కలప డిపోలోని అధికారులు—ఆకాలంలో అధికారమదానికి పెట్టిన పేరుగా రాణించినవారు—యీమెలో అధి

కారం అంటే ఏమాత్రం జంకని వ్యక్తిని చూడగలిగారు. ఇక్కడ వలసవచ్చిన గ్రీకు, ఇటాలియన్ వారినే పనికి నియమిస్తూండేవారు. ఇలాంటివారందరికీ లా బింబినా తల్లిగా తయారైంది. 'యూనియన్లు' అన్నవి లేని రోజుల మాటయిది. ఆరోజులలో సర్వాధికారాలూ యజమానివే.

ఒక కార్మికుణ్ణి పనిలోంచి తీసేశారని తెలియగానే లా బింబినా ఒక ఆచూకీ అడిగింది: 'కష్టపడి పనిచేసేవాడన్న పేరుందా వానికి?' అలా అయితే తిన్నగా డిపోమేనేజరుదగ్గరకి వెళ్లేది. తను చేయబోయే పని న్యాయబద్ధమన్నట్టు నవ్వేది. వచ్చీరాని ఇంగ్లీషు-ఇటాలియన్-ఫ్రెంచి కలగలుపుభాషలో తను చెప్పదలచుకొన్నది సూటిగా చెప్పేది. ఆ తీసేసినవాణ్ణి పెట్టుకునేలా చేసేది.

పనిలోంచి తీసివేయడానికి మంచి కారణాలే వుండివుండవచ్చు. కాని లా బింబినా చతురత ఎక్కడ వుందంటే—సర్వసామాన్యమైన న్యాయచట్టాలను సహితం తెలిసివుండకపోవటంలోనే వుంది. న్యాయాధికారిస్థానం అధిష్ఠించిన సమయంలో ఆమె హృదయమే ప్రధానమైందికాని మెదడు కాదు. సమస్యపునాదికి వెళ్ళి, యిట్టి ఒక వాదన ప్రతిపాదించి, ఎదుటివాడు సమాధానం చెప్పలేని స్థితిలో పెట్టేసేది. "చేయడానికా పనివుంది. వాడు మంచి పనివాడు. పిల్లా పాపా వున్నవాడు. వాడి కాహారం కావాలి కదా? ఏం చేద్దాం?"

ఆమె ఎక్కడ అడుగుపెట్టినా, అదెలాంటి సమస్య అయినా, ఆమె ప్రభావానికి గురిఅయి, దా న్నెదుర్కొనేందు

కెవరికి అవకాశం కలిగేది కాదు. ఎక్కువ భాష రాకపోవ డంతో కొంచెమే మాట్లాడగలిగేది. ఆ చెప్పిన స్వల్పంతో వాస్తవికతకి దగ్గరగా పోయి, ఎదుటివారు మాటలలో మరిచిపోయినదాన్ని సూటిగా చూపేది. "పిల్లలకి రొట్టె కావాలి. మరి?" ఎక్కువ మాటలలో సమాధానం చెప్పని వ్యక్తి కీప్రశ్నకి సమాధానం చెప్పడం సులభం కాదు. సర్వసాధారణంగా యీప్రశ్న జాలిగొల్పుతుంది; దయనీయ మైనదిగా తయారవుతుంది.

పారిశ్రామిక ప్రచారంవల్ల ఆమెభర్త చనిపోయి నప్పుడు, ఆ సంస్థనుండి డబ్బు అందుకునేందుకు, ఆ ప్రమాదమే చావుకి కారణం అని నిరూపించవలసిన అవసరం వుంది. ఈ వాఙ్మూలం యిచ్చిన డాక్టరు కొన్ని సందర్భాలలో, చట్టపరిధిలోకి రాని పరిస్థితికూడ వుంటూవుంటుంది. ఈమె కేసు చేపట్టిన న్యాయవాదులు యింకేమీ చేయలేని స్థితికి వచ్చారు. తానే రాష్ట్రరాజధానికి వెళ్ళింది. ఒకేఒక వాదన – దేవునిమీది నమ్మకంతో సంతృప్తిగా వాషింగ్ టన్ రాష్ట్రపు పారిశ్రామికభీమాసంస్థ డైరెక్టరు ఆఫీసులోకి అడుగుపెట్టింది.

"నాభర్త ఆ కలపడిపోలో పదేళ్ళపాటు పనిచేశాడు. ఒక్కసారికూడా రోగగ్రస్తుడు కాలేదు. ఒకరోజున అతని ఛాతీ రెండు రైలు-రోడ్డుకారుల మధ్య పడి పిప్పి అయి పోయింది. తిరిగి పనిలోకి రానేలేదు. ఆరు మాసాలలో అతను దివంగతుడయాడు. ఇక పిల్లలకీ, నాకూ భోజనం

ఎలా వస్తుంది?'' అక్కడి అధికారి ఆమె వాదనలన్నీ విన్నాడు. రాష్ట్రీపు లాభనష్టాల రక్షణకోసం ఎందరెందరో న్యాయవాదులను ఎదుర్కొన్నా డాతడు. కాని యింత చిన్నది, తిన్ననిది అయిన వాదనకి సమాధానం దొరక లేదు. అతనిదగ్గర వున్న ఉత్తమగ్రంథాలలో దానికి చెప్ప తగ్గ సమాధానం లేదు. దానితో అతని తీర్పు మార్చు కున్నాడు. లా బింబినాకు మిత్రుడయాడు. దాని కేం చేస్తాం?

సగర్వంగా ఆ అధికారి ఆఫీసు వదిలి వెళ్ళింది. అప్పటి వరకూ ఆమెకు రావలసిన పైకం జేబులో వుంది. ఇంటికి వచ్చాక, తన లాయరులకి ఆ డబ్బు చూపి ''మీా చదువు సంధ్యలు నాకేకనక వుండివుంటే'' అందట.

ఎన్నో సంవత్సరాలు విద్యాభ్యాసంతో గడిపికూడ ముఖ్యమైన విషయాలలో నిలబడలేనివారి కెప్పుడూ యిదే సవాల్ చేస్తూండేది లా బింబినా– ''నాకేకనక మీా చదువు వుండివుంటే!'' ఇదే ఆడపిల్లకి పదేపదే చెప్తూండేది.

అరవై అయిదు సంవత్సరాలు వచ్చాక – పిల్లలు పెద్దవారై, పెళ్ళిళ్లై ఎవరింట్లో వారున్నాక, కొంచెం స్వేచ్ఛ లభించి లా బింబినా తొలిసారిగా స్కూలుకి వెళ్ళింది. ఏ దారివెంట తన పిల్లలని తీసుకుని పాతికసంవత్సరాల క్రిందట వెళ్ళిందో, ఆదారివెంటనే, కొత్తదుస్తులతో, చక్కగా దువ్విన క్రాపుతో బయలుదేరి కొండమీాద వున్న స్కూలుకి వెళ్ళింది లా బింబినా కొంచెం అనుమానిస్తూ; లోపలికి అడుగుపెట్టి తన సీటులో వెళ్ళి కూర్చుంది.

లా బింబినా చదువను, వ్రాయను నేర్చుకుంటుంది. స్వాతంత్ర్య ప్రతిపాదనలు, రాజ్యాంగాలు మొదలైన విషయాలన్నీ తెలుసుకుంటుంది. ఆతరువాతనే అమెరికను పౌరసత్వంకోసం అడుగుతుంది–అరవై అయిదు సంవత్సరాల వయస్సులో!

ఈ అనుభవం సరికొత్తది; ధైర్యం చెయ్యాడమే. కాని ఎంతో సంతోషంతో దానికి తల ఒగ్గింది. టీచర్ని స్నేహితునిగా చేసుకుంది. క్లాసురూములో నవ్వులపంట పండించింది. ఎప్పుడైనా జరిగే విందులకి పాట పాడేది; కాఫీ కాచేది; రొట్టె కాల్చేది.

చదువనూ వ్రాయనూ నేర్చుకుంది. స్వాతంత్ర్య హక్కుల ప్రతిపాదన, రాజ్యాంగం మొదలైన విషయాలను గురించి నేర్చుకుంది. అమెరికను పౌరసత్వం పొందిననాడు ఆమె సగర్వమైన చిన్నదిగా రాణించింది. చాలా ఆలస్యంగా జరిగినా యీ ఫలితం ఎంతో సంతృప్తి నిచ్చింది లా బింబినాకు. పనిలో విశ్వాసాన్ని, నేర్పుని చూపిన యీమెకు చదువులో ధైర్యం చాలలేదు. చాలాసార్లు చదువుకున్న వ్యక్తుల పట్ల అసంతృప్తి వెలిబుచ్చినా–చదువంటే ఎంతో గౌరవం వుం దామెకు. అందుకనే తనూ—ఆరోగ్యకరమైన, బలిష్ఠమైన తన చేతులు ఎన్నడూ పుస్తకంపట్టుకోలేనివి—యీనాడు చదువను, రాయను నేర్వాగల నన్నది కనిపెట్టగానే ...ఎంతో ఆనందం కలిగింది.

ఇంగ్లీషుభాష రాయను, చదువను నేర్చుకోవాలన్న దీక్షపట్ల ఆమెకున్న గౌరవానికి కారణం యింకొకటి. చదువు

ఉంటే తన శక్తిసామర్థ్యాలను ఒక దారిన పెట్టగలనన్న నమ్మకం వుండే దామెకి. సంవత్సరాలు గడువను చదువే కనుక వుంటే త నెలా చేసేదో అన్న విషయాన్ని స్పష్టం చేయడంతో – జీవితంలో ఆమె కిదొక్కటే అసంతృప్తి మిగిలిపోయింది. లేకుంటే యితరత్రా ఆమెది పరిపూర్ణత చెందిన వ్యక్తిత్వం. ఈలోటు వున్నప్పటికీ లా బింబినా ప్రభావం ఎక్కువగానే వుండేది. ఈ ప్రభావాన్ని సుల భంగా వర్ణించి చెప్పలేము. ఆఖరుదశాబ్దంలో ఎన్నో ప్రజాసంబంధ విషయాలలో పాల్గొనేది. కాని ఎన్నడూ నాయకత్వం వహించలేదు. ఎన్నడూ ప్రజలను ఒక పద్ధతిన నడిపించాలని ప్రయత్నించలేదు. అస లలాంటి సంస్థలన్నా, సంఘాలన్నా ఆమెకు కొంచెం అనుమానంకూడా. ఆమె మసలిన గుంపులలో తాను చేయగలిగినది చక్కగా చేసేది. పాడేది; వంట వండేది; ధనసేకరణ చేసేది; స్వహస్తాలతో ఎంతో చక్కనివి సృష్టించేది.

అన్నిటికంటె ముందామె తల్లి సుశిక్షితురాలైన తల్లిగా వుండడంతో – మంచిపౌరురాలై వుండక తప్పదు కదా. ఆమెసంతానం ఎప్పుడూ పరిశుభ్రంగా, క్రమశిక్షణబద్ధులుగా, సుష్టుగా భుజించినవాళ్ళలాగ వుండేవారు. తమ వయస్సుకి తగ్గ పని ఎప్పుడూ చేస్తుండేవారు. పైపై మెరుగుల క్రింద దాక్కొన్నాసరే అపరిశుభ్రతని భరించలేక పోయేది (చెవులవెనక మట్టి?). పిల్లలకు స్నానం చేయిస్తూ, వారి లోపలి దుస్తులు పరీక్షిస్తూ – 'ఏమో ఏ గుర్రమైనా తన్ని

నప్పుడు ఏ ముక్కూ ముఖం తెలియనివాళ్లో మన బట్టలు తీయవలసి వస్తే' అన్నది సూచించేసరికి యీ భయంతో చిన్నవాళ్ళు లొంగివచ్చేవారు. పరిశుభ్రంగా స్నానం చేసేవారు. అది ఒక గుణపాఠం.

అందంగా, శుభ్రంగా సామాన్యంగా వుండే ఆమె యిల్లూ, వాకిలీ అమెరికాలో సర్వసాధారణంగా కానరాని అనుభవైకవేద్యమైన జాగ్రత్తని గోచరింపజేసేది. తోట శుభ్రంగా వుంచేది. చక్కని ఫలితాలను పొందేది. అమెరికాకు వలసవచ్చినది భూమిని నిస్సారం చేసిపోవడానికి కాదనీ, శ్రమఫలితాలను ఆనందంగా అనుభవించడానికనీ సర్వదా గుర్తుంచుకొనేదామె. ఏ క్షణాన అయినా మంచువల్ల కష్టం రావచ్చునన్న భయంవుండేదేమో అన్నట్లుగా ఆమె అల్మారాలన్నీ ఎప్పుడూ నిండుగా వుండేవి.

ఈ ముందుచూపూ, జాగ్రత్తా ఆమె మేధకు నిదర్శనలు. వాటికి వెనుక కొన్ని కట్టుదిట్టమైన సూత్రాలున్నాయి! వాటి నామె తు. చ. తప్పకుండా పాటించేది. దుబారాచేయడం తప్పు. స్వశక్తివున్నప్పుడితరులపై ఆధారపడడం తప్పు. నిర్ధారణకాని భవిష్యత్తుకై ముందుచూపు లేకపోవడం తప్పు. అతిథి అభ్యాగతులకు కనీసం రొట్టె, సారా యివ్వలేకపోవడం తప్పు. అవసరం కలవారికి సహాయం చేయ నిరాకరించడం తప్పు.

ఈ నియమాలకనుగుణంగా లా బింబినా పనిచేసింది.. పొదుపు చేసింది. ప్రతిపంటకాలులోనూ రెండు ప్లమ్‌చెట్లు

పళ్ళూ నిల్వకని వేసివుంచేది. ఇవి స్నేహితులకీ, తన పిల్లలకీ, వారి పిల్లలకీ ప్రత్యేకం. ఆమె మరణానంతరం చూస్తే ఆమెగూళ్ళనిండా రకరకాల సారాయిలు-స్నేహితులూ పిల్లలూ ఆమెకని యిచ్చినవి-కనిపించాయి. అట్లాంటిక్ దాటి వచ్చిన ఆమెపెట్టెనిండా స్వహస్తాలతో నేసిన చక్కని బట్ట వుంది. ఇ దామె అర్ధశతాబ్దంముందునుంచి దాచిపెట్టింది.

ఇటువంటి సాధారణమైన వాటిద్వారానే లా బింబినా తన యిరుగుపొరుగుల పై తన ప్రభావాన్ని ప్రసరింపజేసింది. ఆమె మృతదేహాన్ని మోసినవారి సాంఘికప్రతిపత్తి చూస్తే తెలుస్తుంది-ఆపల్లెలో ఆమె ఎంతటి ఉన్నత అభిమానంతో ఉండిందో. ముప్ఫయిసంవత్సరాలపాటు తల్లిగా వుండి ఆదరించింది___జో టింకాని, గ్యుడో సిలోని అనే వారిద్దరు వలసవచ్చి, ఆమెపంచ చేరినవారే! డ్యాక్ షెర్వుడ్, పిటి టౌన్ సెండ్ వున్నారు. ఎర్నెస్టు టీగిల్ వున్నాడు. ఈ ముగ్గురూకూడ హెన్రీమెక్లీరీ కంపెనీలో అధికారులు. లెన్ మెక్లీరీ స్వయంగా అక్కడఉన్నాడు. వారిపేరట స్థాపింపబడిన యీ వూరులోకి ఆ సంతతిలో ఆఖరివాడు మెక్లీరీ.

ఆ అరుగురూ ఆమె శవపేటిక పక్కగా స్మశానంలో నిలుచునివుండగా చూచిన నాకు, ఎక్కడనుంచో వలసవచ్చి, పొట్టపోసుకోవడంకోసం శ్రమించిన ఆమె ఆత్మశాంతికోసం నిలబడినవారిని చూడగానే నా స్వంత దుఃఖం కొంత తగ్గినట్లనిపించింది. ఒక వూహకూడ కలిగింది: ఆ ఆరుగురూ ఇట

ుకి, అమెరికాకు చిహ్నాలు-ప్రతినిధులు. పనివానికి, యజమానికి ప్రతినిధులు. అమెరికను భవిష్యత్తు దృష్ట్యా యీ ఆలోచన చూడగానే వాల్ట్ విట్ మెన్ రాసిన గేయపంక్తులు జ్ఞప్తికి వచ్చాయి నాకు-''ఇక్కడున్న దొక్క జాతి కాదు, జాతుల జాతి''.

ఈమాటలనుగురించి ఆలోచిస్తుంటే వాటిలో నా ఉపాధ్యాయుల గొంతుకలు, నిజమైన అమెరికనులందరి గొంతుకలూ నాకు వినిపించాయి. ఓ క్షణంపాటు అక్కడ నాతల్లి మృతకళేబరాన్ని భూశయనం చేస్తున్నా రన్నది మరిచిపోయాను.



# 2

# కాలువలు తవ్వే లియొనార్డో

ఇటలీలో దక్షిణాదినున్న ఫగ్గియ రాష్ట్రంలో ఒక కొండప్రాంతపు వూరు "సాన్ మార్కో లా కటోలా." విపరీతమైన వేడిప్రదేశం యిది. శతాబ్దాల తరబడి తుఫానుగాలులూ, వర్షాలూ పైపై మట్టిని చుట్టుపక్కల లోయలలోకి చేర్చి, ఆ కొండమీద వూరుని రాతిమయంగా అట్టే వుంచారు. ఆ కొండచరియలోని భూమి పంటతరువాత పంటలతో, పూర్తిగా నీరసించిపోయి, ప్రతి కుటుంబానికీ తీరని ఆవేదనకు కారణం అవుతున్నది. సంవత్సరం గడచి సంవత్సరంరాను—పీలపంటలే అక్కడి పేదకుటుంబాలకి ఆధారం అవుతున్నాయి.

ఈ సాన్ మార్కోలోనే పాట్రిసెల్లి కుటుంబంకూడ నివసిస్తూంది. ఐదుగురుకుమారులు, ఒక కుమార్తె. ఈ కుమారుల్లో కనిష్ఠుడు లియొనార్డో. సేనలో తన వంతు పని ముగించేసరికి అతని అన్నలు సైన్యంనుంచి వచ్చేశారు. ఒకడు దక్షిణఅమెరికాకూ, మిగిలిన ముగ్గురూ యునైటెడ్ స్టేట్సుకూ వెళ్ళారు. తల్లితండ్రులతోను, సోదరితోను యింటిపట్టున వుంటాడు లియొనార్డో అని అనుకున్నారు. విదేశాలు పోయిన అన్నలు సరైన ఉద్యోగాలలో ప్రవేశించడంతో, వారి సహాయంతో ఏ యిబ్బందీ లేకుండా సాన్ మార్కోలో వీరు కాలక్షేపం చేయగలిగేవారే.

సైన్యంలోనుంచి రాగానే తమ పొలంమీద పని చేయడం ప్రారంభించాడు లియొనార్డో. పనంటే భయపడని వాడు. అందంగా, పొడుగ్గా వుండి సరదాగా వుండేవాడు. పదిహేడుమాసాలపాటు ఆగకుండా స్కూలుకి వెళ్ళాడు. అదేనా వ్యవసాయపుపనులు తక్కువగా వుండేకాలంలో. చదువుకోవాలి, నేర్చుకోవాలన్న సహజవాంఛకలవాడు. వయస్సుతోపాటు యీ కోర్కెకూడ ఎక్కువే అయింది.

నాల్గుసంవత్సరాలపాటు తండ్రితో కలిసి పనిచేశాడు. అమెరికానుంచి అన్నలు పంపిన డబ్బుతో కొంత నేల కొన్నారు. తాము పండించిన ధాన్యంనుంచే రొట్టె కాల్చుకునేవారు. తమ ద్రాక్షనుంచే సారాయి తయారుచేసుకునేవారు. తినడానికెక్కువగానే వుంటూ అప్పుడప్పుడు మార్కెట్లో అమ్మడానికికూడా మిగులుతూవుండేది.

"లా క్రిటికా సోషల్" పత్రిక కొనడానికికూడ డబ్బుండేది. ఈ పత్రికని యీ శతాబ్దపు తొలిరోజులలో ప్రఖ్యాత యిటాలియన్ రచయిత, న్యాయవాది, ఇటాలియన్ సోష లిస్టుపార్టీ నాయకుడు అయిన ఫిలిప్పో టురాటి స్థాపించాడు. అచ్చు వేసేవాడు.

చూడ కళ్లూ, ఆలోచించే మెదడూ వున్నా, ప్రతి యువకునికీ దారిచూపడానికీ, ఒక దారిన పెట్టడానికీ ఉపదేశ కుడు కావాలి. తన కలలకి ఒక రూపం యిచ్చి ముందుకు చూపగల వ్యక్తి అతడే అవుతాడు. ఈపనికి లియొనార్డో ఫిలిప్పో టురాటిని ఎన్నుకున్నాడు. ఈ టురాటియే అమెరి కాకు వెళ్ళమన్న ఉద్దేశ్యం కలిగించాడు. అలా యీ సాన్ మార్కో లా కటోలా యిరుక్కుపోయే స్థితినుంచి తప్పించు కొమ్మని సూచించాడు.

బొత్తిగా రొట్టెకోసమే అమెరికాకు ప్రయాణం అయి వెళ్ళలేదు లియొనార్డో. అమెరికనుగా అయినాకూడ పూర్తిగా యీ భోజనంకోసమే అని పని చేయలేదు అతను. ఇదేస్థితిలో ఏ రైతున్నా-అమెరికాలో అన్నలుండి, సహాయానికి దారి వుండివుంటే హాయిగా సాన్ మార్కోలోనే సంతృప్తిగా వుండేవాడు. కాని లియొనార్డోకి యింకో కారణం వుంది. తన పొలంమీద తండ్రితోపాటు పనిచేస్తూ, పక్కన లోయప్రాంతంలో వున్న గొప్ప వ్యవసాయదారులను చూస్తూంటే యిక్కడ ఎంత శ్రమించినా తన కష్టానికి ఫలితం వుండదన్నది గుర్తించసాగాడు. తన సోదరులు

ఆకలి చావు తప్పించుకోవడానికని యిల్లు వదిలారు. వారి సహాయంతోనే యిక్కడ కుటుంబం నడుస్తుంది. ఇరవై సంవత్సరాల యువకవయస్సులో, సైనికానుభవం వున్న తను అన్నల దయాభిక్షపై బ్రతుకున్నాడు. ప్రతిదినం కష్టించి పనిచేసిన ఫలితం అంతే.

అక్కడి యితర రైతుల పరిస్థితి అధ్వాన్నంగా వుండడం గుర్తించాడు లియొనార్డో. వారిలో చాలామందికి అక్షరజ్ఞానం లేదు. వున్నా, కాగితాలమీద తన పేరు రాసి అప్పులో మునిగేపాటిదే ఆ విద్యాజ్ఞానం. చలిని ఆపలేని పల్చటి దుస్తులు వారివి. ఇంట్లో వేడిలేదు. ఎప్పుడూ ఒకటే ఒకే రకపు భోజనం. సబ్బునీళ్లు చాలా తక్కువ వాడుకోవాలి. మందుల అవసరాన్నెదుర్కొనే శక్తి లేదు. ఏదైనా రోగంవస్తే మృత్యువే గత్యంతరం.

శ్రమించడం, అవస్థపడడం నిరుపయుక్తం అని గ్రహించాడు లియొనార్డో. గొప్పవాళ్లు బలంగా వుండి, అధికారం చెలాయిస్తున్నారు. బీదవాళ్ళకి తిన తిండి లేదు. ప్రతిఘటించే శక్తి లేదు. ఉత్సాహం లేదు. వారిలో క్రమశిక్షణ లేదు. చదువుసంధ్యలూ లేవు. అమెరికాలో వుందని తాను విన్నలాంటి సంఘం సృష్టింపబడితే తప్పించి లాభం లేదని గ్రహించాడు. అటువంటి చోటనే తానుండి తన పిల్లలను పెంచాలని తలపోశాడు. అందుకే తిండికోసమే అన్న ప్రశ్న లేదు. ఎందరో రైతులు కాలక్షేపం చేస్తున్నారు. తనకి తిండికి తడుముకోవలసిన పనికూడ లేదు. ఎక్కడికి వెళ్లినా

విజయం సులభసాధ్యం అనికూడా అత నూహించలేదు. అయితేనేం, తన శ్రమకి వాస్తవికమైన ఫలితాలు దక్కా-లని కోరుకున్నాడు.

ఫిలిప్పో టురాటి అందించిన ఆశయాలు చాలా ఉన్నత మైనవి. ప్రతిరైతుకీ భూమి వుండాలి. బీదలకీ, ధనికులకీ సమానంగా విద్యాసౌకర్యా లుండాలి. బీదలను తమ యినుప గుప్పిట బిగించే గొప్పవారి బిగువు సడలించాలి.

ఈ టురాటికల ఎప్పుడో ఒకప్పుడు నిజం అవు తుందని నమ్మాడు లియొనార్డో. ఈ ధ్యేయం చేరాలంటే శ్రమించాలి. కాలయాపన తప్పదు. ఎందరో ఆహుతి కావాలి విజయం కోసం. తనకోసమే అయినట్టయితే లియొ నార్డో సాన్ మార్కో-లోనే ఉండిపోయేవాడు. మారిన సం ఘంలో తను యిమిడిపోవడాని కప్పటికే టైము మించిం దన్నది గ్రహించాడు. టురాటి లాగ తన కీ జీవితాదర్శాలను అమలులో పెట్టగలిగినంతటి విద్యావ్యాసంగం కావాలని కోరాడు. కాని తన కా అవకాశం కలగలేదు. కాని తనకి కొడుకులు పుడతారు. తన కుమారులలో తండ్రి తిరిగి జీవి తం ప్రారంభించవచ్చును కదా.

ఇంకా పుట్టని పిల్లలకోసమని తల్లిదండ్రులని, సాన్ మార్కో-ని వదలి తన అన్నలలాగనే అమెరికాకి వెళ్లాలని నిశ్చయించాడు లియొనార్డో. ఈ నిర్ణయం చేసుకోవడం చాలా కష్టమైంది. తన తల్లిదండ్రులని శాశ్వతంగా వదిలి వెడుతున్నానని తెలుసు. కొత్త ప్రపంచంలో కొత్తయిల్లు

సృష్టించుకొని ప్రథమంలో ఓటమి లేకుండా తన పిల్లలు పెరగాలని ఆశించాడు.

దీనికి తోడుగా యింకో కారణంకూడ వుంది వూరు వదలిపోడానికి. పట్నంలో ఒక తండ్రికొడుకుల తరఫున టురాటి మాట్లాడ్డం విన్నాడు. వారు పొలంమీద జంతువుని దేన్నో దొంగిలించారని ఆరోపించబడింది.

"వారు నేరస్థులే. దొంగతనానికి వ్యతిరేక మయిన చట్టాన్ని ధిక్కరించిన మాట వాస్తవమే. జంతువును పట్టుకున్నారు. దాని మెడ కోశారు. దాన్ని భోజనానికని యింటికి తెచ్చేలోపుగానే పట్టుపడిపోయారు. వారి వాదనంతా, దొంగిలించడానికి కల హేతువంతా ఒక్క ముక్కలో చెప్తారు: ఆకలి. వారి వ్యక్తిత్వాల కదొక్కటే లక్షణం. ఆ తండ్రి చేతులు చూడండి–ఎండిపోయి, పగుళ్లు వేసి, పార కాడకి అనువైన ఆకారంలో వంగిపోయివున్నాయి. ఆ శరీరం వృద్ధాప్యంవల్ల కాదు, అతి శ్రమించడంవల్ల అలా వంగి పోయింది...ఆ కొడుకుని చూడండి, పద్దెనిమిదవ ఏటనే సర్వ నాశనం అయిన మగవాడు. ఆ లోతుకుపోయిన కన్నులలో, పీక్కుపోయిన ముఖంలో నేరంకంటే భద్రత ఎక్కువగా కని పిస్తుంది... ఈ పరిస్థితిలో అధికారాన్ని వహిస్తోంచిన మనమే వారలా దొంగిలించడానికి కారణం అన్నది మరచి పోకూడదు" అని జడ్జితో వాదించాడు టురాటి.

ఆ ఆఖరు వాక్యం లియొనార్డో మనస్సులో నాటుకు పోయింది:..దాన్ని మరువలేకపోయాడు. అమెరికాలో విదే

శస్థునికి జీవితం కష్టమని తెలుసు. కనీసం ముందుకు సాగే ఆశైనా వుంది. చిన్న కుర్రవాణ్ణి దొంగగా మార్చిన యీ ప్రపంచం, యూనివర్శిటీ చదువు దక్కే అవకాశం యిచ్చే నూత్నప్రపంచం – ఈ రెండింటిలోకీ రెండవదాన్నే ఎంచుకున్నాడు లియొనార్డో. జీవితారంభంనుంచీ ప్రేమిస్తూ వచ్చిన గియొవన్నినాను 1907 లో వివాహం చేసుకున్నాడు. తరువాత రెండువారాలకి అమెరికాకని ప్రయాణం కట్టాడు.

చికాగో చేరగానే తన అన్నలతో కలిశాడు. తన భార్య తండ్రి దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది...దాంట్లో గియొవన్నినా రాసింది "నిజమో కాదో తెలియదు. కాని నాకు పిల్లవాడుకలుగుతాడేమో"అని! "ఏమో ఏమిటి? తప్పకుండా కొడుకుపుడతాడు" అనుకున్నాడు. ఇదేరకం విశ్వాసం అతను తలపెట్టిన ప్రతికార్యంలోనూ కనపరిచాడు లియొనార్డో. ఇటువంటి వ్యక్తి విజయుడు కావచ్చు! కాకపోవచ్చు...కాని ఓ పట్టాన వదిలించుకోవడం కష్టం.

పుట్టిన పల్లెను దాటి ముప్ఫయిమైళ్ళ దూరమైనా ప్రయాణంచేయని ఇరవైనాలుగు సంవత్సరాల యువకునికి– సాన్ మార్కోకీ చికాగోకీ మధ్య దూరం ఒక అనుభవమే అవుతుంది. వరిచేలు, పందులు, పశువులు, విశాలమైన బయళ్ళు, నదులు, సరస్సులు అన్నీ చూశాడు లియొనార్డో. మిసిసిపీ బేసిన్ లోని సారవంతమైన భూమిఫలితాలను కళ్ళారా చూశాడు. గియొవన్నినాకు రాస్తూ, "అమెరికాలో భూమి వుంది, నీరు వుంది. ఇదేకదా మనకి కావలసింది. విస్తారమైన విత్తనం వుంటే అన్నీ అనుకున్నట్టు అవుతాయి.

. ని, లియొనార్డో వ్యవసాయదారుడు కాలేదు. తన కున్న చిన్న భూభాగాన్ని తోటగా మలచడం మినహాయించి, ఒక్క దశాబ్దం గడిచే సరికి నీరు, భూమి అతన్ని పూర్తిగా జయించినాయి. పాశ్చాత్య దేశం అంతా అతని ఒట్లతో ప్రతిధ్వనించిం దంటే అతిశయోక్తి కాదు!

దృఢకాయుడు, ఆరోగ్యవంతుడు ఐన లియొనార్డో తన అన్నగార్లతో కలిసి పనికి హాజరయారు...శక్తివంత మైన అతని చేతుల్లో పనిముట్లు రాణించాయి. చికాగో రోడ్లు వేయడంలో నిమగ్ను డయాడు. ఈపనికి కావలసిన నేర్పు సులభంగా గ్రహించుకున్నాడు. తను చేస్తున్న పనికి కావలసిన బలం, ఆరోగ్యం, విశ్వాసం...అన్నీ సమకూర్చు కున్నాడు.

చేతిలో పనిముట్లు అలవాటు అయ్యాయి. ఇంజనీర్లు కావలసిన ఆలోచనలు, ప్లానింగు చేస్తారు. మిగిలిన పని లియొనార్డో చేసేవాడు. ఒక రోజు గడవగానే కడుపునిండా భోజనం, విశ్రాంతి, బ్యాంకులో వేయడానికి యి:కొంచెం డబ్బు వచ్చి పడేవి.

సిమ్మెంటుపని వేరు; దాన్ని చూస్తూంటేనే అలసట వస్తుంది. దళసరి జోళ్ళు వేసుకుని దానిమీద నడవడం మరీను. దానితో నింపిన ప్రతిదీ భూమికి గొలుసులు వేసి కట్టినట్టు తోస్తుంది. ఈ తడిసిమ్మెంటు చాలా గట్టిపడు తుంది. ఓ క్షణంసేపు పరిచి వదిలేస్తే చాలు - పూర్తిగా పరిచేలోపుగానే గట్టిపడిపోతుంది.

కాని దాన్ని లొంగతీయడాని కొక పద్ధతి వుంది. ఆ సులువు లియొనార్డో నేర్చుకున్నాడు. పద్దెనిమిది నెలలపాటు జూలై 1907 నుంచి జనవరి 1909 దాకా, అప్పటప్పట వాతావరణం బాగులేక పని ఆగినా, లియొనార్డో చికాగో రోడ్లమీద పనిచేస్తూనే వున్నాడు. రోజుకు పదిగంటలు, వారానికి ఆరురోజులు...తరచు ఆదివారాలుకూడ పనిచేస్తూ వచ్చాడు.

చలి వాతావరణం ముంచుకురావడంతో 1909 జనవరిలో పని ఆగిపోయింది. రెండుమూడు నెలలదాకా ఏం పని వుండదని చెప్పారు పనివాళ్ళందరికీ. కడసారిగా పోయి తల్లి తండ్రులని చూసి, భూమినీ యింటినీ సరిదిద్దుకు రావాలని తల పోశారు. లియొనార్డో కడసారిగా సాన్ మార్కోని చూడాలని అనుకున్నాడు. ఇటలీకి వెళ్ళి తన భార్యను కూడ పిల్చుకు తెచ్చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు. తన ప్రథమసంతానం పుట్టిన రోజు ప్రాంతాలకు సాన్ మార్కో-చేరుతాడని తాను అనుకున్నాడు.

ఇలా సాన్ మార్కోకు తిరిగిరావడంతో తను యీ వూరు వదలిపోవాలని చేసుకున్న నిశ్చయం చాలా తెలివైన పనిఅయిందని మరొకసారి నిరూపితం అయింది లియొనార్డోకి. అమెరికాపట్లకూడ అతనికి తప్పుడూహలు లేవు. పద్దెనిమిదిమాసాలపాటు తను జీవితంలో ఎన్నడూ చేయనంతగా శ్రమించి పనిచేశాడు చికాగోలో. అయితేనేంకాక జేబులో డాలర్సు, వీపుమీదికి చక్కని దుస్తులు అమి

రాయి. ప్రతినెలా ఏతగువ్వూ లేకుండా అతని జీతం అతనికి అందింది. ముందుకి పోగలుగుతున్నానన్న అనుభవం కొత్తగా అతనికి కలిగింది. చికాగోలో ఇటాలియనులని చూశాడు. తనకున్న పాటి చదువుసంధ్య లున్నవారే ఇళ్ళు కట్టడం వంటి వృత్తులలో ప్రవేశించి రాణించడం చూశాడు. తనకి ప్రత్యేకించి ఏవృత్తీ అమరకపోయినా వాటిని చూసి ఉత్సాహం వచ్చింది. ఆపూ, పద్ధెనిమిదిసంవత్సరాల మధ్య వయస్కులైన పిల్లలు చక్కని బట్టలు వేసుకుని, మధ్యాహ్నంభోజనం పట్టుకుని, పుస్తకాలతో సరదాగా నవ్వు కొంటూ స్కూళ్ళకి పరుగెత్తటం చూశాడు. ఈ దృశ్యం అతని వూహాలకి రెక్కలిచ్చింది.

ఇలాంటివి అమెరికాలో చూసివచ్చాక, సాన్ మార్కో యింకా దైన్యంగా పొడగట్టింది లియొనార్డోకి. ఈ అమెరికను అనుభవందృష్ట్యా సాన్ మార్కోలోని వ్యక్తికి దారిద్ర్యం, వాటినుండి తప్పించుకుపోలేని నిస్సహాయత కొట్టవచ్చినట్టు కనిపించసాగాయి.

పదినెలల తరువాత లియొనార్డో, గియొవన్నినా, ఇద్దరు కొడుకులూ తిరిగి బయలుదేరి పయనమయారు. వాషింగ్టన్ లోని సియటిల్ వారి గమ్యం. పసిఫిక్ మహాసముద్రంపై రేవులలో ఉన్నతిలోకి వస్తున్న పట్నం సియటిల్ అన్నది తప్ప దాన్నిగురించి యింకేం తెలియదు వారికి. ఒక ఏభయిసంవత్సరాలపాటు అక్కడ నిలకడగా పని దొరుకు తుందనిమటుకు తెలుసు లియొనార్డోకి. వెలకట్టని పని అన్నది

చాలు లియొనార్డోని ఆకర్షించడానికి. 1910 లో సియటిల్ లోని రోడ్డుపనిలో తనూ ఒక పనివాడుగా హాజరయాడు. లియొనార్డో.

ఆరోజు బాగా వర్షంపడి చాలా చలిగా వుంది. పని నుంచి లియొనార్డో యింటికి వచ్చేసరికి బాగా చీకటిపడింది. బట్టలు మార్చుకొని స్నానం చేసిన తరువాత వంటయింట్లో మండుతున్న పొయ్యి దగ్గరకి వెళ్లి చేతులు కాచుకుంటున్నాడు.

"గియొవన్నినా, ఏమిటీ వుడుకుతూంది?"—పొయ్యి మీద నుంచి చూస్తూ.

"మైకేల్ కని కాయగూరలు వేశాను."

"దాన్లో ఏముంది?"

"దాన్లో ఆంటోనియాకోసం మాంసం పడేశాను"

"మరి దాన్లో ఏముందో?"

"ఆల్ఫ్రెడోకోసం పులుసు."

"ఇదేమిటి?"

"మటియాకోసం చిక్కుళ్లు వుడికించాను."

"మరీ తోలులా వున్న దేమిటి?"

"అది ఆంద్రియాకోసం మాంసం. దయచేసి యీ పనిటైములో నన్ను విసిగించకు. నువ్విలా మాట్లాడించకుండా వుంటే త్వరగా అయిపోతుంది పని. ఈ కుండలో పాస్కేల్ కోసం మాంసం వేశాను. అవి గుసెప్పినాకోసం.

వండినవి. మరి దాన్లోవి ప్రత్యేకం కోస్టాంజోకోసం చేసినవి. మనకోసం, నీకు నచ్చేలా కొంచెం మాంసం, చాలా కూరలూ వేసి తయారుచేశాను. ఇంక తృప్తేకదా? ఇదంతా కలిసి నా విలువలేని భార్య వండిన తొమ్మిదిరకాల వంటలు... కొంచెం కర్రలు తెచ్చిపెట్టుదూ, మంచివాడివి ... ఇన్ని రకాలు నాకు విడివిడిగా జ్ఞాపకం వుండడమే చాలు— వాటిని మళ్ళీ నీకు చెప్పడంకూడానా?''

''నీ సేవకుణ్ణి రాణీ నేను. కర్రలు తెచ్చిపెడతాను. కాని ఒకటి జ్ఞాపకంపెట్టుకో. వారందరికీ పెట్టడానికి ఒప్పుకున్నది నువ్వే...నా కిష్టంలేని రోజున ఒక్కమాట చెప్తే చాలు.'' సరదాగా ఒక్కటి పడేసి కర్రలు తేడానికి వెళ్లాడు లియొనార్డో.

నిజంగానే వారందరికీ పెట్టడానికి తనే ఒప్పుకుంది. లియొనార్డో క్రమంతప్పకుండా పని చేస్తున్నాడు. కాని మొదటి ప్రపంచయుద్ధానికి ముందు యిలాంటి సామాన్యమైన పనికి ఎక్కువ రాబడి వుండేది కాదు. గియొవన్నినాకి రైతువనిత కుండదగిన అన్ని లక్షణాలూ వున్నాయి.వంటలో బహునేర్పరి. ఇల్లు సద్దుకోవడంలో, కుట్టుపని చేయడంలో కూడ నేర్పరి. లియొనార్డో రాబడితో హాయిగా కాలక్షేపం చేయవచ్చు. కాని నిల్వచేయడం కుదరదు. భవిష్యత్తువుంది. పిల్లలున్నారు. కల లున్నాయి. సాన్‌మార్కోలో చుట్టాలున్నారు. ఇద్దరు పిల్లలనీ, భర్తనీ చూసుకోవడంకంటె యింకా ఎక్కువ చెయ్యగలనన్న నమ్మకం వుంది. ''మన

నలుగురికోసం వండేటప్పుడే ఎనమండుగురికీ వండి పెట్టవచ్చు"
అంత సులభంగా తోచింది. కాని యితరు లుండడం లియొనార్డోకి అంతగా నచ్చలేదు. తన కుటుంబంలో వారంతా రోజూ వచ్చిపోతూవుండడం విసుగనిపించింది. మాటవాళ్లు, పై పెచ్చు యింటియిల్లాలిపై వారు పెట్టే పనికూడా చాలా ఎక్కువ.

పాతదేశంలో ఎప్పుడూ మారని పేద భోజనాలు చేసేవారు; కాని యిక్కడ సుభిక్షంగా అన్నీ దొరికేటప్పుడు వారికి ఓపట్టాన తృప్తిలేదు. ప్రతిఒక్కరూ తనకి కావలసినది నిశ్చయించుకోవడం. ఎవరిభోజనం వారు కొని తెచ్చుకుని, వండిపెట్టినందుకూ, బట్టలు వుతికిపెట్టినందుకూ యిల్లాలికి నెలకి మూడున్నర డాలర్లు యిచ్చేవారు. ఈపద్ధతి చాలా విషమంగా తయారై కూర్చునేది. వండేవారిపై అర్థంలేని భారం వుంచుతున్నామన్న జ్ఞానం లేదు వారికి. దానికి కారణం ఒకచే-వారి యిళ్ళదగ్గిర ఎదురుతిరిగి ప్రశ్నించని స్త్రీలపై యిలాంటి అజమాయిషీ చలాయించడం అలవాటు వారికి.

గియొవన్నినా ఎనమండుగురువ్యక్తులకి వండిపెట్టేది. బట్టలు ఉతికి పెట్టేది. ప్రతిఒక్కనికీ ప్రత్యేకమైన అలమారు పెట్టె. అతనికి వుండినది దాన్లో పెట్టేది. ఒక్కొక్కరి అవసరాలూ గుర్తుపెట్టుకుని కావలసినవి రాసిపెట్టేది-వండడానికి. ప్రతిసాయంత్రం తమకుకాక ఎనిమిదిరకాలభోజనాలు వండిపెట్టేది. ఇదంతా కలిసి నెలకి ఇరవైఎనిమిది డాలర్లకోసం చేసే పని!

లియొనార్డో ముందుగానే ఈ కష్టాలని గుర్తించాడు. తన భార్యకిలాంటి విసిగించే పని తగులుతుందని యోచించాడు. కాని, ఉత్సాహంతో, నమ్మకంతో—సులభంగా పని చేయగలనండంతో పూరుకున్నాడు. అంతే కాదు. తామనుకున్న వివిధప్రణాళికలకీ డబ్బు కావాలి. అందుకని బ్యాంకుఎక్కౌంటు పెట్టుకోవాలి... అందుకని ముగ్గుర్ని తీసుకోవాలని నిశ్చయించుకున్నాడు. క్రమంగా నలుగురు, ఐదుగురు, ఆరుగురు, ఎనమండుగురిదాకా పెరిగిందా సంఖ్య. రెండు సంవత్సరాలపాటు ఓర్పుగా పనిచేసింది గియొవన్నినా. ఆ రెండుసంవత్సరాలూ చాలాకష్టంగానే గడిచాయి. కాని ఆరువందలడాలర్లు నిలువచేయగలిగిందికదా!

ఒకరోజు సాయంత్రం, మగవాళ్ళు వెళ్ళిపోయాక, పిల్లలు పడుకున్నాక, ఇద్దరూ వంటయింట్లో బల్లదగ్గిర కూర్చున్నారు. అక్కడే, కిటికీదగ్గిర, అందరూ నిద్రపోయి యిల్లు నిశ్శబ్దంగా వున్నసమయంలో—ఇద్దరూ కూర్చుని కుటుంబవిషయాలు మాట్లాడుకునేవారు.

"రేపు సాయంత్రం ప్రతి కుండలోనూ, మూకుళ్లోనూ ఏముందో అడుగుదాం అనుకుంటున్నావా? నా ఆర్డర్లు అప్పుడే వచ్చేశాయి తెలుసా?" అడిగింది గియొవన్నినా.

"నీకు తెలుసు నాకేం నేరం చెప్పడానికి లేదని. నువ్వెంతో ధైర్యంగా కష్టపడి పనిచేశావు. ఓ సంవత్సరం క్రిందటే నువ్వింకో పాపని చూస్తున్నప్పుడే వాళ్ళందరినీ పంపించేసివుండవలసింది. రేపు సాయంత్రం వాళ్లకి చెప్పే

ద్దాం, యీ నెలాఖరుకి ఇంకోచోట భోజనం కుదుర్చుకో మని. బ్రతిమాలుతారు; ఎక్కువ డబ్బిస్తాం అంటారు. కాని మనం ఒప్పుకోకూడదు. వచ్చే నెల మొదటి తేదీనాడు యీ బల్లదగ్గర నువ్వూ, నేనూ, మనిద్దరు పిల్లలూ కూర్చుంటాం."

"తరువాత హాయిగా తిని ఎండలోకూర్చుని లావెక్కనా?"

"అమెరికాలో యిలా ఎక్కువ సంపాదించడాని కింకా సరదా అయిన మార్గా లుండి తీరాలి."

"లియొనార్డో, నా కనిపించే దేమిటో తెలుసా, నీ కప్పుడే ఏదో ప్లాను తట్టివుంటుంది. అవునా?"

"ఈ డే స్ట్రీట్‌లో చివరగా ఒక యిల్లు వుంది. తోటా దొడ్డీ వున్నాయి..."

"ఆ యింటిని గురించి నాకు అంతా తెలుసు. నువ్వు దాన్ని గురించి అడిగావనికూడ తెలుసు. అద్దెకూడ ఎక్కువ కదూ. ఏమైనా కొన్ని జంతువులని పెట్టుకొని మళ్లీ తోటపని లోకి దిగుదామనా నీ వుూహ?"

"అంతే అనుకో. భూమి సారవంతమైనదే. నాలు గడుగుల ఎత్తున పెరుగుతూంది గడ్డి. ఒక ఆవు, చెవుల పిల్లులు, గొఱ్ఱెలలాంటివి పెట్టుకోవచ్చు. అమ్మడానికి పా లుంటాయి. వసంతంలోనూ, వేసవిలోనూ ఉదయాన్నే, పని నుంచి తిరిగివచ్చాకా పనిచేస్తాను. పళ్లూ, కూరలూ వుంటాయి అమ్మటానికి; కొద్ది సంవత్సరాలు గడిస్తే సాయం చేయడానికి పిల్ల లుంటారు. ఏమంటావు?"

"పనిచేయడం అంటే నకు భయం లేదని నీకు తెలుసు. కొంచెం భూమి వుండాలనుకోవడం బాగానే వుంటుంది. తోటలో చేయగలిగినంత చేస్తానుకూడా. కాని ఆవు! మనం ఇప్పటికి ఆవుని చూడనుకూడా చూళ్లేదే! మన అనుభవం అంతా ఒక్క గాడిదలమీదే. ఆవులు, వెన్న, పాలు–వీటిని గురించి మనకేం తెలుసు?"

"మనకి తెలియనిది నేర్చుకోవచ్చుగా? ఆవుని గురించి ఎంతో కొంత అప్పుడే తెలుసుకున్నాను. మంచి ఆవు నూరు డాలర్లకి వస్తుందిట. ప్రతిరోజూ పాలిస్తుంది. ప్రతిపద్ధెనిమిది నెలలకీ చిన్న దూడని పెడుతూవుంటుంది. గడ్డికేం ఖరీదు లేదుకదా. గియొవన్నినా, నే చెప్పింది విను–కొంతడబ్బు తప్పకుండా వస్తుంది."

"భూమినుంచి డబ్బు రాబట్టవచ్చు ననుకో. కాని ఆవంటేనే భయంగా వుంది నాకు. నూరుడాలర్లు అంటే మాటలా? చాలా డబ్బుకదా? కొత్తయింటికి ఎప్పుడు మారుతాం?"

"వచ్చే ఒకటో తారీకుకి మారవచ్చు."

"సరే. ఇది అమెరికాలో మన రెండవ అనుభవం అవుతుంది. ఓ సంగతిమటుకు జ్ఞాపకం వుంచుకో. ఈమాటు ఇది కావాలని అంటున్నది నువ్వుసుమీ!" అంది గియొవన్నినా.

ఒక్క విషయంలో తప్పించి వ్యవసాయం బాగానే జరిగింది. గియొవన్నినా ఆవుని గురించి ఎంతగా అనుమా

నించిందో అంతా జరిగింది. వారి తొలిగోవు సాధువైన దైవుంటే బాగుండేది. కాని దానికి దేన్ని చూసినా భయమే. బాధతో సతమతమైపోయి గడ్డి మేయక బక్క-చిక్కిపోయింది. ఇంక చేసేది లేక కసాయిదుకాణానికి అమ్మాలని చూశారు. కాని ఎవరు కొంటారు బక్క-చిక్కిన ఆవుని? ఇక లాభం లేదని నిరాశ చెందుతున్న సమయంలో పొరుగింటాయన, "చూడి ఆవుని కొంటే అయే ఖరీదులో భాగంగా ఈ ఆవుని తీసుకుంటా" నన్నాడు.

మొదటి దిలాంటిది కావడంతో యింకోఆవుని తేడానికే భయపడ్డారీ దంపతులు. ఈ మొదటిఆవుతో కొద్ది మాసాలలోనే రెండువందల డాలర్లు ఖర్చయింది. డబ్బుకి అతిథులని తీసుకుని రెండుసంవత్సరాలపాటు కష్టపడి గియొవన్నినా కూడబెట్టినదాన్లో మూడోవంతు ఖర్చయిపోయింది.

ఈ అమ్మకానికి ఒప్పుకున్నారు. దీనికి కారణం లేకపోలేదు. ఒక్క ఆవు యిలా వున్నంతమాత్రాన అనుకున్న పని మానేయడమూ అన్న పంతమే. మంచి ఆవు కనక వస్తే తప్పక లభిస్తుం దన్న నమ్మకంకూడ యింకాపోలేదు. ఈ రెండో ఆవుతో వీరి అనుభవం అంత బాధాకరంగా లేకపోగా, కొంచెం లాభంకూడా కనిపించడం మొదలుపెట్టింది.

1912 వచ్చేసరికి రోడ్డుపనిలోనుంచి కాలవలు తవ్వడం, పైపులు వేయడం దాకా ముందుకి వచ్చాడు లియొనార్డో. ఒకరోజు మధ్యాహ్నంపూట సిమ్మెంటుబస్తా

మీద కూర్చుని రొట్టెముక్కలు తింటున్నాడు. జూలై నెల అది. తింటూతింటూనే నుదుటిమీది చెమటా, ముఖంమీది చెమటా తుడుచుకుంటున్నాడు. జేబురుమాలు తీసి మెడ తుడుచుకుంటున్నాడు. కొత్తగా కలుసుకున్న మైక్ స్పినొల్లీ పక్కనే కూర్చున్నాడు. ఆరోజు ఉదయాన్న పది హేనడుగుల లోతుగా కాలవ తవ్వుతున్నాడు మైక్–మురుగుకాలవ గొట్టాలు బిగించడానికని.

"చాలా వేడిగా వుంది కదూ ఈరోజు?"

"అవును లియొనార్డో. నీకు వేడికాని నాకు లేదు. నే పనిచేసే లోతులో వేడి లేదు. అమెరికాలో ఎవరూ ఒకే చోట వుండిపోరు. అటు పైకో, యిటు క్రిందికో పోతూ వుంటారు. క్రిందికి వెళ్లాను. చూశావా? తిరిగి పైకి చక్కా వచ్చాను. అర్థం అవుతూందా నాధోరణి?"

మర్నాడు లోతుగా తవ్విన గోతిలోకి మైక్ తోసహా లియొనార్డోకూడ దిగాడు ... తరువాత ఇరవై ఎనిమిది సంవత్సరాలు గడిచాక ఈనాటి మైక్ ఆనాటి లియొనార్డో దగ్గర నమ్మకమైన పనివాడు. కానైతే యింకా గోతిలోనే!

మురుగు కాలవలు కట్టడంలాంటి పనిలో తన నేర్పునంతా వినియోగించవచ్చునని తలపోశాడు లియొనార్డో. మైక్ లాగ యితడూ వ్యవసాయపు పనిముట్లని సులువుగా వాడగలడు. కాని మైక్ కి లేని ఊహ లున్నాయి లియొనార్డోకి. ఏపనైనా త్వరగా నేర్చుకుంటాడు. త్వరత్వరగా

పనిచేసి కంటికి నదరుగా కన్పించే ఫలితాలు చూడాలని ఆశిస్తాడు లియొనార్డో. పని కష్టమైనదే. కాని ఆపని కొంచెం మెదడుకి పని కల్పించేదయితే ఎంతో సంతోషంగా చేస్తాడు. 1917 వచ్చేసరికి దేశంలోని బహునేర్పరులైన కాలవపనివారిలో లియొనార్డో ఒకడు.

1917 నాటికి అమెరికా తొలిప్రపంచయుద్ధంలోకి తానూ దిగుతుందన్న విషయం స్పష్టం అయింది. కావలసినంత పని లభించింది ఎంత అనుభవశూన్యునికైనా వ్యాపారంలోకి దిగడానికి అమెరికాలో యిది సరైన సమయంగా వుంది. అందు కేవిధమైన అడ్డంకులూ లేవు. తనకి భాష రాకపోవడం కారణంగా వచ్చే యిబ్బంది తప్పించి యింకేదీ అతని దారి కడ్డురాలేదు.

తనకు తెలిసిన యింకో ముగ్గురు పనివాళ్ళతో మాట్లాడి, కాలవలపని ప్రత్యేకంగా చేద్దామని ఆలోచన చేశాడు. తొలుత కొంచెం వెనుదీసినా, లియొనార్డో వారిని ఒప్పించి ఒక ఒప్పందానికి వచ్చాడు. ఇక పనికోసం చూడ్డం ప్రారంభించారు. తాము ఓంప్రథమంగా అడిగిన పదిహేనువేల డాలర్ల పనికి ఒప్పందం కుదిరిపోయింది. ఎదురుచూడని ఈ అదృష్టానికి ఆశ్చర్యం చెందారు.

పదిహేనువేల డాలర్లు! పనంతా అనుకున్నట్లుగా జరిపించేస్తే మూడువేలడాలర్లు లాభంగా మిగులుతుంది. ఇంత త్వరగా పని చేతికొచ్చేయడంతో తిరిగి బాధపడ్డం ప్రారంభించారు. ఇంత త్వరగా వచ్చేసిందే, తాము అడిగిన

రేటు తక్కువేమో! మిగిలినవాళ్లెందు కీపనికి వప్పుకోలేదో? పని పూర్తిచేయడానికి కావలసిన 15000 డాలర్ల బాండు యివ్వగలరా? పనిచేయాలన్న ఆత్రుతలో ముందుగా బాండు నిలబడే కంపెనీకి వెళ్ళలేదు. అనుభవంకూడా లేదాయె. తమకి అనుభవం లేదు. పేరుప్రఖ్యాతులు లేవు. అందుచేత ఏ బాండు కంపెనీకూడ గ్యారంటీ యివ్వదని తెలుసుకున్నారు. తమకున్నదంతా పోగుచేసి చూస్తే యింకా సగం తరుగుతూంది. స్నేహితులనుంచి యింకో మూడువేల దాకా సంపాదించగలిగారు. గౌరవంగా బ్రతుకుతున్నారనీ, నిజాయితీ కలవారనీ తెలుసుకుని ఒక బాండు కంపెనీ తరుగుధనాన్ని మదుపు పెట్టడానికి ఒప్పుకుంది. ఇక పని ప్రారంభించడమే తరవాయి.

పైకి చూడ్డాని కీపని ఏమంత కష్టమైనదిగా తోచదు. రెండు నెలల్లో పని ముగించితే మూడువేల డాలర్ల లాభం మిగిలితీరుతుంది. తామే సూర్యోదయం నుంచి సూర్యాస్తమానంవరకూ పనిచేస్తూ, యింకో యిద్దరు ముగ్గురిని మటుకు పనికి పెట్టుకోవాలని నిశ్చయించారు.

ఆత్మవిశ్వాసంతోనూ, ఉత్సాహంతోనూ, కొంచెం భయంతోనూ పనిలోకి దిగారు. మొదటిరోజున అంతా బాగానే గడిచిపోయింది. నేల గుల్లగా, యిసుక పర్రలాగా తోచింది. అంచేత ఎక్కువ కష్టపడకుండానే అనుకున్న దానికంటె ఎక్కువగానే పనిచేయగలిగారు. అలసిపోయినా సంతోషంగా యింటికి వెళ్ళారు. విందుభోజనం చేశారు.

తా మెంత లాభాలు తీస్తామో, యింకా అనుభవం రావ డంతో ఎంతెంత పనులు చేస్తామో తమ తమ భార్యలకు చెప్పుకున్నారు.

ఇరవై ఐదుగోజులపాటు పని చేసేసరికి సగందాకా పని పూర్తి అయింది. ఆ తవ్వడం ఎంతో సులభంగా ఉండ డంతో లియొనార్డోకి బెంగపట్టుకుంది. అక్కడక్కడ నేల తడిగా, బురదగా, వూబిగా కూడ వుండడం గుర్తించాడు. మిగిలినవాళ్లూ దీన్ని గుర్తించారు. కాని ఏ ఒక్కరూ భయం కరమైన వూహకి తావివ్వడానికి ముందుకిరాలేదు. లియొ నార్డో తొలిసారిగా గుర్తించాడు - అవి కాలవపనివారి శత్రువులైన దొంగయిసుక నేలా, నీరూను! ఆ గోతిలోంచి గబగబ బయటపడి గట్టిగా తిట్టుకున్నాడు. సాన్ మార్కోలో అందరూ ఆత్రంగా ఎదురుచూసే నేలా, నీరూ ఈనాడు తనకి చావుగా తయారయాయి! ఎంత గట్టిగా తిట్టుకుంటున్నా డంటే, ఓ ముప్ఫయి అడుగుల దూరంలో అరుస్తున్న మాటిమో పిలుపుగాని, ఏంటోనియో అరుపులుగాని విన బడలేదు. వారికీ యిదే శత్రుదర్శనం జరిగింది. ముగ్గురూ కూడా కాలవలు తవ్వడంలో నేర్పరులు కావడంతో ఈ పరిస్థితి ఎంత నిరాశాజనితమైనదో యిట్టే వూహించుకో గలిగారు.

పరాజితులైనామని గ్రహించాడు లియొనార్డో. కాని రక్తాన్ని చెమటగానైనా ఓడుస్తాడుగాని అంతట్లో లొంగి పోయేవాడు కాడు లియొనార్డో. ఆ పని తలపెట్టినది తను.

అది తన బాధ్యత. అత నందులో అపజయం పొందితే— ఎవరూ 'ఏమో, జరిగేదేమో' అన్న అనుమానం ప్రదర్శింప కూడదు. కాలవలలో ఈ దొంగయిసుకానీళ్ళకి ఒక్కటే మందుంది: కాలవ కిరువైపులా దూలాలు బలంగా పెట్టడం. ఆవిధంగా నీరురాకుండా కట్టుదిట్టం చేసి గోయి కావలసినంత లోతుకి తీసుకుపోయి, అక్కడ పైపులైనులు వేయడం. తన దగ్గిర వున్నదానితో ఈపని సాధ్యం అయితే తప్పకుండా చేస్తాడు తను. ఇక యిప్పుడు డబ్బుకోసం వెనక్కు చూడ్డంలో అర్థంలేదు. తన కాలిక్రింద నేల ఎప్పుడైతే తప్పుకొందో అప్పుడే తాను దివాలాతీశానని తెలుసు కున్నాడు. అందుకని కాలవ తవ్వాదా మనుకున్నంత మేరా గోతులు తవ్వి...ఆ దొంగయిసుక నేల ఎంతవరకూ విస్త రించి వుందో కనిపెడదామని నిశ్చయించాడు. ఇదెక్క డైతే మొదట కనిపించిందో అక్కణ్ణుంచి ప్రారంభించారు.

పనంతా వృథా అయింది. నాలుగు రోజులు శ్రమ పడి కొన్నివందల అడుగుల దూరంలో మూడు గోతులు తవ్వారు. ఒక బకెట్టునీరు పైకి తీసిపోస్తే తక్షణం యింకో బకెట్టు సిద్ధం అవుతూంది. ఈపని యంత్రాలవల్ల అవుతుంది. అవి తమదగ్గిర లేవు. అవి కొనడానికి పదిహేనువేలడాలర్ల కెన్నో రెట్లు అవుతుంది. పూర్తిగా అలసిపోయి, అపజయం పొంది చివరికి యింటికి వెళ్ళి తమతమ భార్యలకు చెప్పక తప్పలేదు...పరాజయం వొప్పుకోక తప్పలేదు...కాని అంత టితో వూరుకోరు.

కొత్తగా అమెరికాకు వచ్చి ఈ భూభాగంలో జీవితం సృష్టించుకుందామన్న వానికి-నిజాయితీని వదులుకోనివానికి ఈ 'పశ్చిమసియటిల్ అపజయం' దురదృష్టమే. దీనితో పోల్చిచూస్తే ప్రారంభంలో సంభవించిన కష్టాలు లెక్కలోకే రావు. లియొనార్డో కూర్చుని జమాంఖర్చులు చూసుకున్నాడు. మొత్తంమీద మూడువేల డాలర్ల అప్పు మిగిలింది. ఒక నెల పనిపోయింది. పొదుపుచేసి దాచిన రెండు వేల డాలర్లూ ఖర్చయిపోయాయి. అమెరికాలో పదిసంవత్సరాలు గడిపాక, నలుగురు బిడ్డల తండ్రి అయిన లియొనార్డో యిటువంటి పరిస్థితిలో నిలబడ్డాడు.

దీనికి తోడు విలువ సులభంగా కట్టలేని యింకో నష్టం వచ్చిం దతనికి. ఈ నిజం గుర్తించక తప్పదు. అతని శక్తిసామర్థ్యాలని కూలంకషంగా వ్యక్తపరుపగలిగిన పని ముళ్లే తన మాట వినలేదు. విజయం సాధించలేదు. ఈ పరిస్థితిలో విజయసాధన అన్నది అసంభవం అని గుర్తించినా, తను పరాజయం పొందానే అన్నదిమటుకు నిజం. తొలినుంచీ ఈపనికి ప్రోద్బలం చూపి ప్రారంభించినది తను కనుక, మిగిలినవారిపట్ల తన బాధ్యత కాదనలేకపోయాడు. పని విజయవంతంగా కొనసాగుతుందని తలపోశాడు. ఈ వృత్తిలో పేరుప్రఖ్యాతులు పొందగలుగుతా ననుకున్నాడు. కాలు నిలవగలుగుతానని తలపోశాడు. ఈ రెండవ ప్రయత్నానికి పరాజయమూ, అప్పూ అంత హృద్యంగా తోచలేదు.

కాని తన పక్షంగా—వయస్సు, శక్తి, దృఢవిశ్వాసం, ఆత్మబలం, తన భార్య గియొవన్నినా వున్నాయి.

కిటికీదగ్గరగా వంట యింట్లో టేబిలు దగ్గర కూర్చుని వాటి సాధకబాధకాలను చర్చించారు. పొరుగునున్న ఒక వ్యక్తి యీ వ్యాపారపు ఒప్పందం దివాలాతీసినట్టు ఒప్పేసుకోమని సలహా యిచ్చాడు. "ఇది చాలా సులభం. కోర్టువారు నువ్వు దివాలా తీశావని నిర్ణయించుతారు. నీదగ్గర ఏముంటే దాన్ని మీ అందరికీ పంచేస్తారు. మిగిలిన అప్పు రద్దుచేసేస్తారు" అన్నాడు.

"ఇది చట్టంకావచ్చు. కాని న్యాయం కాదుకదా! నన్ను నమ్మినవాళ్ళదగ్గిర అప్పుతీసుకున్నాను. ముగ్గురికి మేం నెలకూలీలు బాకీపడ్డాం. అవి అప్పులే. అప్పులు తీర్చితీరాలి. అలాంటి చట్టం వెనక దాక్కోను నేను. నా కవసరం లేదు. టైముపడుతుంది. అయితేనేం – నే బాకీపడిన ప్రతిడాలరూ తీర్చితీరతాను. నాకు ఆరోగ్యం వుంటే చాలు" అంటే –

"నేనూను" అంది గియొవన్నినా.

"నువ్వా! నాకున్నదానివేగా, మళ్ళీ కొత్తగా ఎందుకు?"

"ఉన్నదాన్ని యింకా బాగా వుపయోగించుకోవచ్చుగా. బ్లాక్ బియర్ క్లోత్ ఫాక్టరీలో కుట్టుపనికి కుదిరాను. రోజూ ఉదయం వెడుతున్నాను."

ఆమె అంతే చేసింది. ఎన్నో సంవత్సరాలపాటు కొనసాగించింది. నౌకానిర్మాణ స్థలాలలో పనిచేశాడు లియొనార్డో. తోటపని పెంచారు. పెద్దకుర్రాళ్లిద్దరి మీదా ఎంత బరువు వేయాలో అంత బరువూ వేశారు. కాలవపనికి నియోగించిన ముగ్గురికీ వారి భాగం కూలీ యిచ్చారు. తరవాత, అప్పుతీసుకున్న డబ్బు తిరిగి యిచ్చారు. చివరికి బాండుకంపెనీకి తమ భాగం మూడువేలూ యిచ్చేశారు. యుద్ధంవల్ల పెరిగిన కూలీరేట్లవల్ల 1920 చివరికి వచ్చేసరికి అన్ని అప్పులూ తీర్చివేశారు. ఇల్లు కట్టుకోందుకు తగినంత నేలకూడ కొనుక్కున్నారు.

ఇల్లుపని కూడా పెద్దపనే. కొండమీద రెండంతస్తుల భవంతి. విశాలమైన వంటగది. భూగర్భంలో ఒక గది - సారాయిలు నిలవచేయడానికి. దాన్నే తరవాత పెంచి కాలవపనిముట్లూ, యంత్రాలూ పెట్టడానికి సరిపడేదిగా చేయాలని. బలవంతులూ, ఆరోగ్యవంతులూ అయిన రైతుకీ, పిల్లలకీ అని సృష్టించబడినది యీ యిల్లు.

మొదట అనుకున్న ప్లాను బాగానూ, అందంగానూ కూడా వుంది. ఇంటిని అంచీలవారీగా కట్టుకురావాలనీ, అప్పుచేయకూడదనీ. ఇప్పుడిప్పుడే అప్పులనుంచి బయటపడిన యీ దంపతులు యికపై ఎప్పుడూ అప్పన్నది చేయకూడదని నిశ్చయించుకున్నారు. నెల తరువాత నెలగా కావలసిన సామాను కొనాలని నిర్ణయించుకున్నారు. కర్రపనివాణ్ణి ఒక్కణ్ణి పెట్టుకుని కష్టమైన పని చేయించాలనీ,

మిగిలిన పనంతా లియొనార్డో విశ్రాంతి సమయంలో చేయాలనీ అనుకున్నారు.

ఇంటిపని చేయడానికి అనువుగా లియొనార్డో రోజూ సాయంత్రం నాలుగు గంటలనుంచి రాత్రి నాలుగుగంటల దాకా నౌకాకర్మాగారంలో పని చేస్తూండేవాడు. కొద్ది గంటలు విశ్రాంతి తీసుకొని, తెల్లవారినదే యిల్లుకట్టడం పనిలో నిమగ్నమైపోయేవాడు. రోజులు గడిచినకొద్దీ ఎంత లేదన్నా ఏడుగంటలసేపైనా యిల్లు కట్టడంపై పట్టి పనిలోకి వెళ్లేవాడు లియొనార్డో. మగవాడెంత బలంగా వుండాలో అంత బలమైనవాడు; తమ యిల్లు రూపం తీర్చిదిద్దుతున్నాడు. అందుకే యింత కష్టపడినా సంతోషంగానే వుంది. ఒక్క నెల గడిచేసరికి భూగర్భంపని పూర్తిచేసి సాధారణమైన యింటి నేలని తయారుచేయగలిగాడు. ఇరుగుపొరుగులంతా కళ్ళారా చూడ్డానికది అక్కడ వుంది – దిట్టంగా, సువిశాలంగా.

చూడ్డానికని తరుచుగా వచ్చిపోయే యిరుగుపొరుగు వారు అయాచితంగా సలహాలిచ్చి, కొంచెం సాయంచేయడానికికూడా వుండిపోతూండేవారు. ఇలా స్నేహితులూ, చుట్టాల సహాయం వల్లకూడ భూగర్భగృహభాగం కట్టడం పూర్తిఅయింది. అక్కణ్ణుంచి యిక ముందుకుసాగడం మందగించింది. తామనుకున్న ప్లానుప్రకారమే యిల్లు పూర్తిచేయదలచుకుంటే కనీసం యింకోసంవత్సరమైనా పడుతుం దన్నాడు వారు నియోగించిన కర్రపనివాడు.

"పై భాగం చాలా నెమ్మదిగా జరుగుతూంది. కావలసినవరకూ అప్పుతీసుకుని, కావలసిన సామానంతా కొనేసి ఎక్కువమందిని వినియోగించడం మంచిది" అన్నారు.

ఏం? ఎందుకు చెయ్యకూడదు? వారికి చుట్టుపక్కల ఎంతో మంచి పలుకుబడి, పేరుప్రతిష్ఠలు వున్నాయి. ముఖ్యంగా, డబ్బు పోయినప్పుడుకూడ 'దివాలా' ఎత్తి అప్పు ఎగగొట్టడానికి యిష్టపడనప్పటినుండి ఇద్దరూకూడ మంచి జీతాలే సంపాదిస్తున్నారు. సుదూర భవిష్యత్తు ఆశాజనకంగానే కన్పడుతూందికూడా.

"ఓ ఐదువేల డాలర్లు అప్పుచేదాం. తొలిదగ్గరనుంచీ నెలకి వందడాలర్ల చొప్పున అప్పు తీర్చడం ప్రారంభిద్దాం. మన ఎక్కువడబ్బు వుపయోగిస్తున్నట్లూ అవుతుంది; ఇల్లు కట్టడంకూడా త్వరగా పూర్తిఅవుతుంది" అంది గియొవన్నినా.

"నిజంగా అలాగే అంటున్నావా? ఇప్పుడేకదా ఐదువేల డాలర్ల అప్పు తీర్చడం ఆపాం? అలాగే యింకో అప్పు పీకలమీదికి తెచ్చుకుని కూర్చోడం నాకు బాగుండదు" అంటూ, లియొనార్డో ఎటూ నిర్ధారణచేసుకోలేకపోయాడు. కాని గియొవన్నినామటుకు ఒత్తిడి తేవడం ప్రారంభించింది.

"ఇది అలాంటిదేం కాదు. మొదట మనం అప్పు చేసినప్పుడు మనకేం వుంది, ఒక్క గెలుస్తామన్న ఆశ తప్పించి? కాని యిప్పుడు యిల్లు వుంటుంది. అప్పుచేసిన ప్రతిడాలరుకీ ఈయింట్లో ఒక డాలరు వుంటుందికదా.

ఎవరికీ నష్టం వుండదు. ఇంకేదురదృష్టమూ వెంటాడకపోతే ఓ ఐదుసంవత్సరాలలో అప్పుతీరిపోతుంది.''

నిజంగా ఐదుసంవత్సరాలలో యింటిమీద తెచ్చిన అప్పు తీర్చివేశారు. 1926 నవంబరు. తమ సంతోషం వెలిబుచ్చడంకోసం లియొనార్డోదంపతులు విందు ఏర్పాటు చేశారు. పద్ధతి అమెరికనుఅయినా భోజనంమటుకు ఇటాలియన్ భోజనమే.

ఆరోజు కృతజ్ఞత తెలపడానికి చాలా వుంది. కొత్తగా వచ్చినవారికి 1920–26 దాకా సుఖజీవితమే. తల్లీ తండ్రీ కలిసి కష్టపడి పనిచేశారు. లియొనార్డో తిరిగి కాలవల తవ్వడానికి తమ యిద్దరి ఆదాయంనుంచీ కొంత నిలవచేశాడు. మగ కుర్రవాళ్లు బలంగా ఎదుగుతున్నారు. శక్తిసంపన్నులుగా తయారవుతున్నారు. పనికి వెనకతీసే రకం కాదు. పెద్దవాడు పన్నెండేళ్లు స్కూల్లో పూర్తిచేశాడు. చదువులో, ఆటపాటలలో పేరుగడించాడు. ఓ సంవత్సరంపాటు తండ్రితో కలిసి కాలవల త్రవ్వకంలో పనిచేశాడు. 1926 తొలకరిలో యూనివర్శిటీలో చేరాడు–వైద్యవిద్యలో శిక్షణ పొందాలని. జానీ సంగీతంలో కృషిచేస్తున్నాడు. మిగిలిన యిద్దరూ స్కూల్లో చక్కగా చదువుకుంటున్నారు. తల్లిదండ్రులూ, పిల్లలూ కలిసిమెలిసి పనిచేసుకుంటూ చదువులుమటుకు పక్కకు నెట్టలేదు. ఇప్పుడు ఓ యిల్లంటూ కూడా ఏర్పడింది. ఇరవైసంవత్సరాల క్రిందట యిక్కడికి వచ్చినవారికి ఇప్పుడు ఓ యిల్లు ఏర్పడింది.

బల్లచుట్టూ భోజనానికి కూర్చునివున్నారు పన్నెండు గురు—లియొనార్డో కుటుంబం, యితర చుట్టపక్కాలూను; ఇద్దరు కుర్రవాళ్ళ ఉపాధ్యాయులు; యింకా స్నేహితులు-సరదాగా కాలక్షేపానికి. రకరకాల భోజనపదార్థాలు, కొత్తసారాయి నిలవలనుంచి కావలసినంత మద్యం పట్టు కొచ్చిపెట్టారు ఆడవాళ్లు.

భోజనంతరవాత జానీ పాట్రిసెల్లీ, యింకా కొందరూ చక్కని యిటాలియన్ గీతాలు పాడారు. "రిటర్న్ టు సొరంటో" గీతం ఆఖరున పాడారు.

ఈ విందు జరిగినమర్నాడు-సోమవారంనాడు-వారికి అధికారముద్రతో ఒక నోటీసు వచ్చింది-చెమటోడ్చి సంపాదించిన ప్రతిడాలరూ ఖర్చుపెట్టిన యీయిల్లు ఖాళీచేయాలని. ఇది నమ్మ శక్యంకాలేదు. బాండుగంపెనీవారు 1917 నాటి అప్పులో మిగిలినదాన్ని తొమ్మిదిసంవత్సరాల వడ్డీతో సహా చెల్లించమన్నారు. ఇదంతా కలిసి మూడువేల డాలర్లదాకా అవుతుంది.

ఏం జరిగిందో ఎవరికీ తెలియలేదు. లియొనార్డో ఆ బాండులో తన వంతు చెల్లించివేశాడు. మిగిలిన యిద్దరు భాగస్థులూ కట్టలేదా? అయితే దాన్నిగురించి ఎప్పుడూ ఎందుకు చెప్పలేదు వాళ్లు? ఇరవైఏళ్ళపాటు కష్టపడ్డ ఈ పాట్రిసెల్లీ కుటుంబీకులకు, న్యాయబద్ధంగా అప్పులన్నీ తీర్చిన వారికి ఏవిధమైన హక్కులూ లేవా? తిరిగి మూడువేల డాలర్లు కట్టాలా?

ఈ ప్రశ్నల కెలా సమాధానం చెప్పుకున్నానరే ఒకటిమటుకు మిగిలింది: బాండుకంపెనీవారికి లియొనార్డో వ్యక్తిగతంగా ప్రమాణంచేశాడు – అప్పు అంతా తీరుస్తానని. నిజానికి, కట్టకపోడానికి అతన్నే బాధ్యుడుగా ఎన్నాలికదా?

లియొనార్డో చూడవెళ్లిన లాయరు అభిప్రాయం అదే. కరుణలేని న్యాయం అది – కాని న్యాయమే. కష్టించి పని చేయడానికీ, అలా సంపాదించిన దానితో అప్పులు తీర్చడానికీ లియొనార్డోకి హక్కూ, అవకాశం యిచ్చేది కూడా అదే. ఈ అప్పు మాట యిచ్చినది. నైతికంగా దీన్ని కాదనలేడు. రెండువేలా ఐదువందల డాలర్ల రొక్కానికి అప్పు రద్దుచేయడానికి ఒప్పుకొంది కంపెనీ. కావలసిన డబ్బు యింటిమీద అప్పు తెచ్చి మాట దక్కించుకున్నాడు లియొనార్డో.

ఇల్లు వదలమని నోటీసు రాగానే పాట్రిసెల్లీ కుటుంబంలో విషాదం అలుముకొంది. ఏమైందో అర్థంచేసుకొనేపాటి వయస్సు వచ్చింది కుర్రవాళ్లకి. హార్వర్డు వైద్యకాలేజీకి వెళ్లాలని కుతూహలపడే లిబరినో కల కరిగిపోయినట్టు అయింది. తన సంగీత శిక్షణ కిది భరతవాక్యం అని గుర్తించాడు జానీ. క్లోత్ ఫాక్టరీలో పని మానేద్దాం అనుకుంటున్న గియొవన్నినా 'యింకో రెండేళ్లు పనిచేయక తప్ప' దనుకుంది.

"మీ రేమీ వదులుకో అక్కర్లేదోయ్. ఎలాగో ఒకలాగ లిబరినో వైద్యం చదవడానికి వెడతాడు. జానీ

సంగీత శిక్షణ ముగించుతాడు. మిగిలిన యిద్దరూ కూడా పెద్దవారయాక వారేది యిష్టపడితే అదే చదువుతారు. తీర్చవలసిన అప్పొకటి వుంది. ఈ స్కూలు టరమ్ తరువాత ఓ ఆర్నెల్లో, సంవత్సరమో పాటు లిబరినో పనికి వెడతాడు. అమ్మమటుకు ఫాక్టరీలో పని తక్షణమే మానేయాలి. మనం మగవాళ్ళం మీ అమ్మను యిక చూసుకోగలం. అప్పు తీరిపోగానే...మీ చదువులు పూర్తిచేసుకుందుకు వెడుదురుగాని" అన్నాడు లియొనార్డో. "నేను నాపని వదలను; మన పెళ్ళి అయిన దగ్గరనుంచీ యిద్దరం కలిసే అన్నీ చేశాం-నీకు తెలియదు కనుకనా? మన పిల్లల చదువు నీ కెంత ముఖ్యమో నాకూ అంతే. ఈ అప్పు తీరేదాకా నేనూ పని చేస్తాను" అంది గియొవన్నినా.

అందరూ పనిచేయడం ప్రారంభించారు. ఉట్టినే ఉన్న నేలమీద కూడా తోటపని ప్రారంభించారు. ఎంత తక్కువ వీలైతే అంత తక్కువ వ్యయం చేస్తూ, సమయం దొరికినప్పుడల్లా, అవకాశం చిక్కినప్పుడల్లా అదనంగా పని చేసేవారు. 1928 చివరికి వచ్చేసరికి అప్పు తీరిపోగా కొత్తనిలవ ప్రారంభం అయింది.

1930 చివరికి వచ్చేసరికి పని దొరకడం దుర్లభం అయింది యునైటెడ్ స్టేట్స్‌లో. కాని ఆ సంవత్సరాలే పాట్రిసెల్లీ కుటుంబానికి విజయవంతంగా, ఆశాఫలితంగా తోచాయి. 1934 లో తర్ఫీదు పూర్తిచేసిన మూడవ కుమారుడు ఫ్రెడ్ మెకానిక్‌గా పనిలో ప్రవేశించాడు. 1930

నడుమలోనే సంగీత పాఠాలు యివ్వడం ప్రారంభించాడు జానీ. 1936 నాటికి ఆఖరువాడు – ఎర్నెస్టు–వాషింగ్టన్ విశ్వవిద్యాలయంలో సాంఘిక శాస్త్రాలలో పట్టా పుచ్చుకున్నాడు. లియొనార్డోకి యీ శాస్త్రమంటే చాలా ఆపేక్ష. కష్టతరమైన మార్గాన్ని పుచ్చుకున్న లిబరినో అందరిలోకీ చివరగా చదువు ముగించాడు. 1926 లో ప్రి – మెడికల్ తర్ఫీదు పుచ్చుకుని, 1937 నాటికి హార్వర్డు యూనివర్శిటీ పట్టా పుచ్చుకున్నాడు. 1930 చివరి నాటికి లియొనార్డో కూడ కాలవలమీద విజయం సాధించ గలిగాడు. ముప్ఫయి సంవత్సరాలు పట్టింది. అయితే నేంగాక కృతకృత్యుడయాడు లియొనార్డో.

అయితే ఈ దంపతులని చివరికి అదృష్టం వరించిందా? లేదు. చివరగా వచ్చిన యీ విజయాలు వారి శ్రమకి ఫలితాలుమాత్రమే. ముప్ఫయిసంవత్సరాలక్రిందట, అప్పుడు లేని పిల్లలకోసం సాన్‌మార్కో వదలివచ్చారు; ఎంతో దురదృష్టం పాలయారు; ఖరీదైన పొరపాట్లు చేశారు. కాని ఎప్పుడూ తమ ధ్యేయాన్నిమటుకు మరిచిపోలేదు. పిల్లలకు వారు కోరిన విద్యలు గరిపారు.

ఇది పనిదొరకని సమయంలోకూడా వారు సాధింప గలిగారనడంలో ఆశ్చర్యంలేదు. తమ జీవితంలో తొలిభాగం సాన్‌మార్కోలో గడిపి, జీవించడంకోసం కష్టపడి పని చేయడం నేర్చుకున్నారు. అక్కడే శూన్యంనుంచికూడా ఏదేనో ఒకదాన్ని సృష్టించడం అన్న క్లిష్టమైన కళ అలవరచుకొన్నారు.

ఇలా ప్రారంభంలో నేర్చున్న వీరికి స్థానిక అమెరికనులకంటె మంచి అవకాశం చిక్కింది. నిజాయితీతో, బాగా పనిచేయడం అన్నది వీరికి సహజమైపోయింది. తత్ఫలితంగా లియొనార్డొ కాలవలపనిలో, గయొవన్నినా బట్టల ఫాక్టరీలో 'మంచి పనివాళ్ళు' అని పేరు తెచ్చుకున్నారు. సంవత్సరాలు గడిచినా వీరి యజమానులు వున్న పని వీరికి యివ్వడం మటుకు మానలేదు.

కాలాన్ని పట్టి నిలబడడం వీరికి యింకో నేర్పు. సాధారణ అమెరికనులు ఎటూ తెలియని అయోమయంలో పడిపోయే పరిస్థితిలో డబ్బు లేకపోయినా నిలదొక్కుకో గలరు వీరు. ఒక డాలరుతో ఎక్కువ రాబట్టుకోవడంలో బహునేర్పరులు వీరు. భూమినుంచి భోజనాని క్కావలసిన దంతా పండించగలరు. కొన్న చెవులపిల్లులూ, కోళ్ళూ మాంసం, గుడ్లూ క్రమంతప్పక సరఫరాచేస్తాయి. చవుక మాంసాన్ని సహితం అద్భుతమైన వంటగా మార్చగల నేర్పరి గియొవన్నినా. కుట్టుపనిలో నేర్పువల్ల యింట్లోవారి గుడ్డలకి లోటులేదు. ఎప్పుడూ అంత ఐశ్వర్యం అంటే తెలియకపోవడంచేత వారి జీవితప్రమాణాలు ఒకేచోట నిలచి, స్థానబలిమి సంపాదించుకుంటాయి. తిరిగి అమెరికాలో ఎక్కువ పనికి అవకాశాలు రాగానే పెట్రిసెల్లీకుటుంబం చాలా చక్కని అదనులో వుంది. లియొనార్డొ తిరిగి యింకో సారి కాలవల పనిలోకి ప్రవేశించడానికి సిద్ధంగా వున్నాడు.

1939 లో వచ్చింది అవకాశం. సంగీతపాఠాలు చెప్పుకుంటూన్న జానీకి అదేం నచ్చలేదు. తండ్రితో కలిసి

పనిచేయడానికి సిద్ధపడ్డాడు. తొలిసారి చాలా చిన్నపని ఒప్పుకున్నారు. అప్పుచేయకుండా అయిపోయే పని అది. మూడువందలడాలర్లకి కొంచెందూరం నాల్గంగుళాల కాంక్రీటు పైపు వేయడానికి ఒప్పుకున్నారు. జాగ్రత్తగా నేల పరీక్ష చేసి, నీరు వూరదని నిర్ధారణ చేసుకున్నారు. చాలా జాగ్రత్తగా ఆలోచించి ఈపని మూడువేలకి తక్కువకి ఎవరూ ఒప్పుకోరని తెలుసుకుని మూడువందలకి చేయడానికి సిద్ధపడ్డారు.

తామేం చేస్తున్నదీ బాగా తెలుసుకున్నారు. డబ్బు పోనూపోదు, రానూరాదు. ఈ మూడువందలకీ పైపూ, సిమ్మెంటూ వస్తుంది. ఏకాస్తో మిగిలినది ఇద్దరి కూలిలో సగంకూడా వుండదు. ఈ అవకాశం కోసం, పనిచేసి చూపడంకోసం తమ కాయకష్టాన్ని వుచితంగా యివ్వడానికే నిశ్చయించారు. కట్టడంపనులు చాలా బాగా జరుగుతున్న రోజులలో ఈ పనిలోకి ప్రవేశార్హత సంపాదించడానికీ మదింపు తక్కువే. ఒక్కసారి ప్రారంభిస్తే తండ్రీకొడుకులు కలిసి పైకిపోగలరు.

ఈనేలవిషయంలో లియొనార్డో తప్పటడుగు వేయలేదు. అంతా గుల్లగా యిసుకనేలే. కాని లోపల కాలవ గట్లు కూలిపోవు అని తేల్చుకున్నాడు. కాని ఒకే కష్టం-- కొన్నిచోట్ల కాలవ యిరవైఅడుగుల లోతుదాకా తవ్వవలసివుంటుంది.

1939 వసంతపు ఎండలో తండ్రీ కొడుకూ పని ప్రారంభించారు. కష్టమైనపనీ, ప్రమాదకరమైనదీ అంతా

తండ్రే చేస్తున్నాడు. పూర్వపు అనుభవం దృష్ట్యా రోజు రోజూ పనిచేస్తూ ఏ కష్టాన్నైనా ఎదుర్కోడానికి సిద్ధపడుతూ పనిసాగించాడు. గడియారాన్ని లెక్కచెయ్యకుండా పెంద రాడే మొదలుపెట్టి ఆలస్యంగా ముగిస్తూండేవారు పని. అంత పనీ అనుకున్నదానికంటే సవ్యంగానే జరిగింది. అను కున్నదానికంటే ముందుగానే కూడ పని ముగించారు.

"మీ ఖరీ దేం అంత తక్కువకి దించారు"—తమని నియోగించిన మిస్టర్ కార్ల్మన్ అడిగాడు.

"మీరడిగినదానికి పదిరెట్లు యివ్వవచ్చు ఆపనికి. పని పరిశీలించిన వ్యక్తి చాలా చక్కగా చేశావన్నాడు. ఇరవైఅయిదుసంవత్సరాలలోగా ఇంత బాగా చేసిన పని చూడలేదు అన్నాడు" అనికూడ అన్నాడాయన.

"అలా ఎందుకు చేయవలసివచ్చిందో చెప్తాను. మీకూ, ఆ పరిశీలకునికీ...మా పని చాలా బాగుంటుంది; నన్నూ నాకొడుకునీ నమ్మవచ్చు అన్న అవకాశం యివ్వ డానికి. ఇందుకని నేను తక్కువకి ఒప్పుకున్నాను. మీకు మాపని నచ్చితే మీ యితరపని మా కివ్వండి. ఈపని ఎంత నిఖార్సుగా చేశానో అలాగే అంతా చేస్తాం" అన్నాడు లియొనార్డో.

"ఇప్పట్నుంచి నా యీ కాలవల పనంతా మీకే యిస్తాను" అన్నా రాయన.

స్వేచ్ఛగా నవ్వుతూ, "అలాగే. కాని యిక యిలా బహుమానంగా పనిచేయడం వుండదని విన్నవిస్తున్నాను" అన్నాడు లియొనార్డో.

కాలవలను గెలిచాడు! సాన్‌మార్కోనుంచి వచ్చిన రైతు అమెరికాలో త్రవ్వి విజయం సాధించాడు. తన కుటుంబాన్ని కొత్తప్రపంచానికి తీసుకువచ్చాడు. కోరుకున్న చదువు చదువుకొనే అవకాశం కొడుకులకి కలిగించాడు. చివరికి తనకి తానే యజమానిగా తయారయినాడు. ఏభయి ఆరుసంవత్సరాల లియొనార్డో స్వంతంగా కాలవలతవ్వకం ప్రారంభించాడు.

మరో పదిసంవత్సరాలు గడిచేసరికి ఎర్నెస్టుకూడా మిగిలినవాళ్ళతో చేరాడు. తండ్రీకొడుకులు వ్యాపారంలో వేలూని నిలవగలిగారు. కావలసినన్ని యంత్రాలు, పరికరాలు కొన్నారు. వాటికి మెకానిక్ ఫ్రెడ్. లియొనార్డో జానీతో కలిసి ఖరీదులు కట్టేవాడు. కాని 'ముసలివాడు' మటుకు చివరిదాకా కాలవలలోకి దిగడం మానలేదు. ఎన్నో సంవత్సరాలక్రిందట తనని ఈపనిలోకి దిగమని ప్రోత్సహించిన మైక్‌తోసహా, యింకా చాలామందిని పోగుచేసి ఎంత పైపు వేయడానికి వీలుంటుందో అంతా మిషనుల సహాయంతో వేయసాగాడు. ఎప్పుడూ లాగే తనే కష్టమైన పనికి పూనుకునేవాడు. అన్ని ప్రమాదాలకీ బాధ్యత తనే నెత్తినవేసుకునేవాడు. అరవైతొమ్మిదేళ్ళువచ్చినా రోజుకి ఎనిమిదిగంటలు కాలవల్లో పనిచేసేవాడు. ఇప్పటికీ 'ముసలివాడికి' సాటి రాలేదు కొడుకులు.

1952 జూన్ 5–వ తేదీనాడు పాత్రిసెల్లీ కుటుంబంలో చాలా వుత్సాహంగా వుంది. నలభైఐదు సంవత్సరాల

వైవాహిక జీవితం గడిపిన ఈ దంపతుల కది అమెరికాలో నలభై ఐదవ సంవత్సరారంభం. లియొనార్డోకి అరవై తొమ్మిదవ జన్మదినం. కొడుకులూ, వారి భార్యలూ పిల్లలతో పంధొమ్మండుగురుదాకా హాజరయ్యారు. మేనత్తలు, పినతండ్రులు, వారి పిల్లలు – ఓ ఇరవై మందిదాకా వున్నారు. అక్కడ వున్న పైవాడల్లా ఒక యూనివర్సిటీ ఉపాధ్యాయుడు; ఆ యింట్లో పెంపుడుకొడుకులాంటివాడు. అంతా నలభై ముగ్గురు గుమికూడా రక్కడ. పిల్లలందరికీ ముందే భోజనాలు పెట్టేశారు. పెద్ద భోజనాలగదిలో టేబిలు చుట్టూ అంతా పెద్దవాళ్లే కూర్చున్నారు.

ఎప్పుడొచ్చినా ఒకరికి స్థలం దొరికే ఆ పెద్ద బల్ల మీద రకరకాల వంటకా లున్నాయి. పాట్రిసెల్లీ కుటుంబంలో అన్ని విందులూ గియొవన్నినా ఆధ్వర్యానే జరుగుతాయి. ఇలాంటి సమయానికి మంచి విందు ముఖ్యం. అందరు కుటుంబంవారూ చేరా రక్కడ.

ఇదే ఆ కుటుంబంలో జరిగే ఆఖరు విందూను. కాని అక్కడ ఎవరికీ అలాంటి అనుమానం కూడా రాలేదు. లియొనార్డో దారుఢ్యాన్ని చూసిన వారికి, అతని నిజాయితీపై అపరిమితమయిన నమ్మకం వున్నవారికి అసలే అనుమానం రాలేదు.

ఆఖరు విందేమో అన్నట్టే పూర్తిగా మధ్యాహ్నం అంతా టేబిలు దగ్గరే గడిపేశారు. అప్పుడప్పుడు స్నేహితులు వస్తూనే వున్నారు–అభినందించడానికి. గియొవన్నినా,

కోడళ్లూ కలిసి వండిన కేకులూ, వంటకాలూ తింటూ, సారాయం త్రాగుతూ సంతోషాన్ని వెలిబుచ్చుతున్నారు. పిల్లలంతా నేలమీద ఆడుకొంటున్నారు. ఆడవాళ్ళు యింటి గొడవలు మాట్లాడుకొంటున్నారు. కుర్రకారు ఆటలవిషయాలు చర్చిస్తున్నారు. పెద్దవాళ్ళు ఇటలీలో రాజకీయాలను గురించీ, అమెరికాలో రాబోయే ఎన్నికలను గురించీ వాదప్రతివాదాలు జరుపుతున్నారు. ఆ బల్ల చుట్టూ సంభాషణ మూడు అంచీలుగా జరుగుతూంది. మూడు అంచీలుగా కుతూహలం వ్యక్తమవుతూంది. ఈ మూడింటి లోనూ కూడా గట్టిగా లియొనార్డో కంఠస్వరం వినపడు తూనే వుంది. సంతోషం, ఆరోగ్యం వెల్లివిరిసిన స్వేచ్ఛా యుతజాతి వీరు.

వస్తురూపంగా కళ్లకి కనబడుతోంది వారు సాధించి నది. సామాన్యమైనదే. కాని అదే దాని ప్రత్యేకత కూడా. నలభై అయిదు సంవత్సరాల పాటు తవ్వడం సాగించాక, రైతుగా వచ్చిన వ్యక్తి తన శ్రమఫలితంగా చూపగలిగేది ఏమిటి? ... సారాయిగూళ్లూ, అల్మారాలూ నిండుగా వున్నాయి. అది ముఖ్యమైన దీవెన కదా! కొడుకులలో ప్రతి ఒక్కడూ ప్రత్యేకంగా కట్టించుకున్న యిళ్లలో వుంటు న్నారు. ఎంతోమంది కుంటుంబాలకు సరిపోయేటంత పెద్ద యింట్లో తనూ, గియొవన్నినా వంటరిగా వుంటున్నారు. సం వత్సరానికి ఎంత లేదన్నా 150,000 నుంచి 200,000 ఆదాయం వచ్చే కట్టడపు పనులలో ముగ్గురు కొడుకులు

వుంటున్నారు. నాలుగోవాడు పరపతిగల డాక్టరు. త్వరలోనే కొత్త కేంద్రానికి మకాం మారుస్తాడు. ఈ కేంద్రానికి పునాది అంతా లియొనార్డో కట్టినదే. వ్యాపారంలో ముసలివాడైన లియొనార్డో యీనాటికీ వారానికి నలభై గంటలు పనిచేస్తాడు. అంత ఆరోగ్యమైన శరీరం అతనిది.

ఇది రాతిలో, యిటుకలో కనిపించే ప్రతిఫలం. డబ్బుతో కొలవగలిగేది. కుటుంబం అంతా కలిసి పని చేయగా యిదంతా – కాలవలతవ్వకంలోనుంచి వచ్చినదే. గర్వింపతగ్గ పనితనమే. దాని వెనుక యింకా ఏదో వుంది. మెదడుకి మేత వేసేదీ, ఆలోచింప జేసేదీ అదే; ఈ పని వెనుక కనబడే...అసాధారణవ్యక్తి అసాధారణమైన స్త్రీని వివాహం చేసుకున్నాడు.

కొత్తవాని విజయగాథలాంటి సామాన్యమైనది కాదు లియొనార్డోజీవితం. లియొనార్డో వున్న రాష్ట్రంలోనే, అతని చుట్టుపక్కలవారే, అతనికంటే తక్కువ నేర్పరులే, తక్కువ నిజాయతీకలవారే ఎక్కువ డాలర్లు గడించడం మనం చూడవచ్చు. అమెరికాలో ఉన్న యిటాలియనులని, అలాంటివారిని గత పాతికసంవత్సరాలలో ఎందరినో చూశారు ఉపాధ్యాయులు. వీరందరిదీ ఒక తరహా, ఎంత ధనవంతులో అంత అనాకర్షితులు–అని తేల్చుకున్నాడు.

లియొనార్డో ఒక్క గెలుపుకోసమే పనిచేయలేదు. అతని ధ్యేయం అంతా–సురక్షితంగా వుండాలనీ, తనకొడుకులకు యిల్లన్నది వుండాలనీ, వారు జీవితంలో బాగా తయా

రయేందుకు కావలసిన అవకాశాలను యివ్వాలనీ, బాగా చేసిన పని వుండాలనీ, దేన్నో సృష్టించాలనీ కోరుకున్నాడు. ఒక్క లాభమే ధ్యేయంగా పనిచెయ్యలేదు. వ్యాపార దక్షత, నేర్పు అలవడనేలే దాతనికి. తన బ్యాంకులెక్క పెంచేదృష్టి యింకా ఎక్కువగా వుండివుంటే, అతనింత ముక్కుసూటిగాపోయేవాడులా తయారయేవాడుకాదు; ఇంత నమ్రత, మర్యాద పెంచుకొనేవాడు కాదు. ఇంత నిజాయితీగా వుండేవాడు కాదు.

ఇన్ని యిబ్బందుల ముఖంలోకూడా లియొనార్డో కొంత ఆస్తి సంపాదించుకోగలిగాడు–తన తత్వాన్ని మార్చుకోకుండానే. కొంత దాటినతరువాత, అంతకుమించి ఏఒక్కడూ సంపాదించుకోలేడు——ఆత్మవంచన చేసుకోకుండా అని తెలుసు లియొనార్డోకి. జీవితపరమావధి పట్ల ఒక దృఢమైన దారి వుందతనికి: శరీరాన్నీ, మనస్సునీ సర్వదా శ్రమింపజేయి; కుటుంబంకోసం శ్రద్ధ వహించు. నీ నిపుణత ఎరిగివుండు. నువ్వొ పురుషుడ వన్నది సర్వదా గుర్తుంచుకో.

ఎంత హాయిగా బ్రతికాడంటే, తన అరవైతొమ్మిదవ పుట్టిన రోజునాడు లియొనార్డో శారీరకంగానూ, మానసికంగానూ యౌవనుడుగానే వున్నాడు. అప్పుడూ అంతూ పంతూ తెలియని భవిష్యత్తు అతని ముందు వుంది. అమెరికను కొత్తప్రపంచంలో వున్న నలభైఅయిదుసంవత్సరాలలోనూ ఇటాలియను రైతుతత్వంనుంచి పూర్తిగా అమెరికను

తత్వానికి మారాడు లియొనార్డో. ఎంతో వుంది తవ్వడానికి. అమెరికా యిచ్చే ఎనలేని బహుమానం – పనిచేసేందుకు అవకాశం–పూర్తిగా సద్వినియోగం చేసుకున్నాడు. ఆపని లోనే బాగా చేస్తున్నాం, దేన్నో సృష్టిస్తున్నాం అన్న సంతృప్తిని పొందగలిగాడు. పిల్లలకీ, భార్యకీ అండగా వున్నా నని గర్వించాడు.

వీందు జరిగిన కొన్ని నెలలతర్వాత ఒక ఆదివారం మధ్యాహ్నం – అది నవంబరు ఆఖరురోజు–లిబరినోయింటికి వెళ్ళాడు లియొనార్డో, అక్కడ తోటలో ఒక ఎకరం దాటు వేయాలని. ఉదయం అంతా తోటపనిలో గడిపాడు. కలుపు తీసి, చెట్లూ వేళ్ళూ పీకి...మెరకనుంచి పల్లానికి రాళ్ళు అడ్డంగా, నీరుపోకుండా, పెట్టాడు.

మధ్యాహ్నం భోజనంకోసం ఆగాడు. భోజనం ముగించి మంచినీళ్లు తాగి తిరిగి పనిలోకి వెళ్ళాడు. దక్షిణపు పక్క పరిశుభ్రం చేయాలని. అందరికంటె ఓ పెద్ద చెట్టు ఎంచుకుని దాన్ని తీసే ప్రయత్నాలు చేస్తున్నాడు. దాన్ని పూర్తిగా పెళ్ళగించలేదు. ఇంకొకటి రెండు దెబ్బలతో అది పడుతుంది. ఎత్తికొట్టాలని ఎడంచేతిలో గొడ్డలి గట్టిగా పట్టుకుని పైకి ఎత్తాడు. దాన్ని క్రిందికి దింపు తూంటే...హృదయాన్ని ఆపేటంత నెప్పి వచ్చింది. క్రింద పడిపోయాడు. అంతే. ఇక లేవలేదు.

"ఏఅధికారిచావుకైనా యింతమంది జనం వుండి వుండరు" అంటున్నాడు మృతకళేబరానికి అంత్యక్రియలు జరుగుతూంటే చూడవచ్చిన మంగలి దర్జీవానితో.

"నిజమే. లియొనార్డో పాట్రిసెల్లీ సాన్‌మార్కో-లోనే వుండిపోయివుంటే – అతని శవపేటికపక్క నిలబడి, అతను చేసిన మంచినిగురించి చెప్తూవుండేవాడు కాదు యూనివర్శిటీ ఉపాధ్యాయుడొకడు."

అర్ధమిలియను జనాభా గల పట్నంలోకూడా ఒక మైలుపొడవున జనప్రవాహం, రెండుట్రక్కులనిండా పుష్ప గుచ్ఛాలు అన్నది సాధారణదృశ్యం కానేకాదు. అందులోనూ, ఏసంఘాలకీ, సంస్థలకీ చెందని సామాన్యునికోసం-ఒక్క పనిలోకి తప్ప యిల్లు వదలి బయటికి వెళ్ళనివాని కోసం-యిది అబ్బురమే. అనాదిగా యిలాంటి దప్పుడప్పుడు జరుగుతూవుంటుంది. మంచితనం-సుగుణం అన్నది ఆకర్షవంతమైన శక్తి కలిగివుంటుంది. లియొనార్డోపాట్రిసెల్లీ అలాంటి సుగుణపుంగవుడే మరి.



# 3

## ద్రాక్షపంటల తల్లి

# రోజా మాండవీ

పొట్టిగా, నిటారుగా, బలిష్ఠంగా కనుపించే రోజామాండవీ అరవైసంవత్సరాలు నిండినా వయస్సులో చిన్నదానిగానూ, ఉత్సాహంగానూ కన్పిస్తుంది. నల్లని చర్మం జీవం వుట్టిపడుతూ, పరిశుభ్రంగా వుంటుంది. అక్కడక్కడ కనిపించే పండు వెంట్రుకలు మినహాయించి, ఆమెజుట్టు వంకీలుతిరిగి నల్లగా వుంది. సరదాగా నవ్వుతూ చిన్నపిల్లల వుత్సాహాన్ని కనుపరుస్తూవుంటాయి ఆమెకళ్లు. దట్టమైన కనుబొమలు, నున్నటిఎర్రని పెదవులు, శుభ్రమైన

చర్మము—యివన్నీ కలిసి ఆమెముఖాని కో కొత్త జీవా న్నిస్తున్నాయి. ఈకళ సాధారణంగా మహిళలు తమ నల భైయవ ఏటనే పోగొట్టుకుంటారు!

1952 సెప్టెంబరుమాసంలో ఒక ఆదివారంనాడు నేను మొట్టమొదటిసారిగా రోజామాండవీని కలుసుకున్నాను. ఈమెకుమారులు రాబర్టూ, పీటరూ నన్ను తమ తలిదండ్రుల యింట భోజనానికని ఆహ్వానించారు. నేను తక్షణమే అందుకు అంగీకరించాను.

రాబర్టు, పీటర్, మాండవీలు 'ఛార్లెస్ క్రగ్ వైనరీ' యజమానులు ; సొంతదారులు. కాలిఫోర్నియాలో నాపా లోయలోని ఉత్తమమైన ద్రాక్షతోటలలో యిది ముఖ్యమైనది. వీరి తల్లితండ్రులైన సిజరే, రోజామాండవీలు కాలిఫోర్నియాలోని 'లోడి' లో కాపురం వుంటున్నారు. ఈప్రదేశం ద్రాక్షతోటనుంచి కారుప్రయాణం అయితే రెండుగంటలు పట్టేటంత దూరంలో వుంది. మేము బయలు దేరబోయేముందుగానే పీటర్ తన తల్లికి ఫోన్ చేసి చెప్పాడు – నన్ను తీసుకువస్తున్నట్లు.

"ఇలా టెలిఫోను చేయడం వుట్టి మర్యాదకోసం." అన్నాడు ఆమెసమాధానంకోసం వేచివుంటూ. "అమ్మా నాన్నాకూడా ఆదివారాలనాడు ఐదుగురిదగ్గరనుంచి పదిహేనుమందిదాకా అతిథులని ఎదురుచూస్తారు లే!"

మేము 'లోడి' చేరేసరికి మిట్టమధ్యాహ్నం అయింది. రోజామాండవీ, ఒక కుమార్తే కలిసి వంటయింటి పనిలో

వున్నారు. సీజర్ మాండవీ, యింకోకుమార్తే ఏవో వ్యాపారానికి సంబంధించిన ఉత్తరాలు చూసుకుంటున్నారు. మేం యింట్లోకి వెళ్ళీవెళ్ళడంతోటే పని ప్రారంభించాము.

"టేబిలుమీద ఎందరికి సద్దనమ్మా" అని అడిగింది మిసెస్ పీటర్ మాండవీ. ఆ టేబిలు నిజానికి ఓ కుటుంబానికి కాదు, ఓ తెగకి సులభంగా సరిపోతుంది.

"ఆదివారాలనాడు యిక్కడ లెక్కలు చూడంమేం" నవ్వుతూ అంది రోజా మాండవీ.

"టేబిలు పూర్తిగా సర్దేయి. ఈరోజు చివరికి వచ్చేసరికి అన్ని స్థలాలూ నిండుతాయిలే."

నేనూ, మిసెస్ రాబర్టు మాండవీ వంటయింటిలో సహాయం చేయడానికి నిశ్చయించుకున్నాం. వంటయిల్లు విశాలంగా వుంది. చక్కగా గాలీ వెలుతురూ వస్తూంది. చక్కటి సామాను అమర్చివుంది; వంటపాత్రలూ అవీ ఎన్నో వున్నాయి. పని చేసుకుందుకు తగినంత స్థలం వుంది. ఓపక్కగా టేబిలుమీద తెల్లని బట్ట కప్పివుంది. దాని మీద మాంసం, జున్ను, ఆలివ్ లు, ద్రాక్షసారాలు, యింకా ఎన్నో రకాల పానీయాలూ వున్నాయి. భోజనానికి ముందు వచ్చి చూసి, చర్చికిపోయేవారు తాగడానికీ, తినడానికీ యివన్నీ అమర్చారు.

భోజనానికి ఇంకా ఏర్పాట్లు జరుగుతూవుండగానే యీ అతిథులు రావడం ప్రారంభం అయింది. కొందరు పెరటివైపు గుమ్మంలోంచి వచ్చారు. కొందరు ముందుగుమ్మం

లోంచి వచ్చారు. ఎలా వచ్చినవారైనా తిన్నగా వంటు యిల్లు చేరుకున్నారు. పాస్కేల్, ఆంటోనియో, గిసెప్పీ ఆల్ఫ్రెడో—అందరూ మాండవీ దంపతుల స్నేహితులే. అందరూ పనిచేసుకుంటూ ఆదివారం విశ్రాంతి తీసుకునే వారే. కొందరు భార్యలతో సహా వచ్చారు. కొందరేమో తమ భార్యలు యింటిదగ్గర భోజనం సిద్ధంచేస్తున్నారనీ, తర వాత వస్తారనీ చెప్పారు. కొందరు గంటసేపు వుంటే, కొం దరు కుశల ప్రశ్నలు వేసుకొని, ఒకసారి ఒక డ్రింకు పుచ్చుకునేంత సేపు వుండేవారు. ప్రతిఒక్కరూ కూడా క్రమశిక్షణ కలిగిన బిడ్డలాగ యింటి యజమానిని పలకరించి నిలచేవారు. తన నేదో బలవంతం చేస్తే పుచ్చుకుం టున్నట్టు ముఖంపెట్టి నటిస్తూనే కానిచ్చేవారు. తొలుదొల్త వచ్చిన వారిలో పాస్కేల్ ఒకడు.

"శుభోదయం మిసెస్ మాండవీ" అని వంటింట్లోకి వచ్చేసేడు. "ఎప్పుడూ పని చేస్తూనే వుంటారు. విశ్రాంతి తీసుకోరా" అని అడిగాడు.

"ఓ, పాస్కేల్! పనిచేయకపోతే యింకేముంది చెయ్యడానికి? ఓ గ్లాసులో సారాయం పోసుకో. టేబిల్ మీద చాలా రకా లున్నాయి."

"వద్దు వద్దు. నన్ను బలవంతం చేయకండి. ఇంకా భోజనం చేయలేదు."

"భోజనం చెయ్యలేదా! అయితే బల్లమీద అదీ వుంది. కూర్చుని భోజనం కానియ్యి. తరవాతే తాగుదు గాని."

"వద్దు లెండి. ఇంటి దగ్గిర నా భార్య వంట సిద్ధంచేసి వుంటుంది. కాస్తసేపు గాలిలో తిరిగిపోదామని వచ్చాను. మీ పని చూసుకోండి. నా అడ్డుని లెక్క చెయ్యకండి. ఓ రెండు నిమిషా లుండి వెళ్లిపోతాను."

"పోనీలే, భోజనం చేయలేదు కనుక చాలా కొద్దిగా పోసుకో. సారాయి కాకుండా యింకా రకరకాల డ్రింకు లున్నాయిగా బల్లమీద."

"ఓ, సరే మరి. చిన్న డోసు భోజనాని కేం ప్రమాదం తేదేమో! పోనీ, మిమ్మల్నెందుకు కాదనడం? చిన్న గ్లాసులో తీసుకుంటాను" మాట్లాడుతూనే పాస్కేల్ టేబిలు దగ్గరకి వెళ్ళాడు. కూర్చుని ఓ బాటిల్ తీశాడు. దాని పై గుర్తు జాగ్రత్తగా పరిశీలించాడు. చూస్తూనే "వహావా! ఇది నవాబుల సారాయి! కానీయండి, ఈ రోజిది యీ పేదవాని కడుపులో పడుతుంది" అంటూ గ్లాసులో పోసుకుని, గ్లాసు ఎత్తిపట్టుకున్నాడు. గౌరవంగా మిసెస్ మాండవీ కేసి చూస్తూ, "మీ ఆయురారోగ్యాలకోసం" అంటూ ఒక్క గుక్కలో మింగేసి 'బాగుంది' అనుకున్నాడు. అంతటితో యిక సారాయి లంటే కుతూహలం చూపడం ప్రారంభించాడు.

"సెయింట్ హెలెనాలో మీ కుమారులు తయారు చేసిన మద్యాలలో ఒకటికదా యిది? అద్భుతంగావుంది. ఇది వరలో నాకు దీని సంగతే తెలియదు. దీ న్నేమంటారు?"

"పాస్కేల్! ముప్ఫయ్యేళ్ళనుంచి అమెరికాలో వుంటూ యింకా ఇంగ్లీషు చదువలేకపోతే? దాన్ని 'గామె'

అంటారు. యింకో గ్లాసుడు పోసుకో. ముందు కొంచెం రొట్టె అయినా తిను'' నవ్వుతూ అంది మిసెస్ మాండవీ.

అక్కడున్న సులభమైన వాతావరణం చూసిన పిదప హాయిగా అమరి కూర్చున్నాడు పాస్కల్. అక్కడ వున్న రొట్టె, వెన్న, ఆలివ్ అంతా తిన్నాడు. అన్నిరకాల మద్యాలూ రుచిచూశాడు.

ఈలోపున నేనూ, మిసెస్ మాండవీ, మిగిలిన అమ్మాయిలూ కష్టపడి వంట అయిందనిపించాం. మూడు గంటలయేసరికి వడ్డించడానికి సిద్ధంగా వున్నాం. యిరవై మందికి సద్దాం బల్లమీద. మేం కూర్చునేసరికి పదహారు గురం మాత్రమే వున్నాం. సగం భోజనం సాగేసరికి యిరవైమంది మయాం. ఇంకా చాలామంది స్థలం ఖాళీ అవడంకోసం వెనకగా నిలబడ్డారు. భోజనం పూర్తి అయే సరికి బల్లదగ్గిర ప్రతి కూర్చీలోనూ మనిషి అమురుతాడని మిసెస్ మాండవీ అన్న మాట యధార్థం అయింది.

భోజనసమయంలో ఆవిడకేసి తిరుగుతూ ''మిసెస్ మాండవీ! ఇంత రుచిఅయిన భోజనం ఎప్పుడూ చేయలేదు నేను. వంటలమీద ఓ పుస్తకం ఎందుకు రాయరు మీరు?''

''రాయి, రాయి అంటారు. నేను ఎప్పుడేనా స్కూలుకి వెళ్ళివుంటేకదా.''

''తొలితరగతులుకూడ చదవలేదా?''

''లేదు. ఒక్క రోజుకూడ స్కూలుగడప తొక్క లేదు. ఇటలీలో నేను పని చేసిన యింటావిడ కొద్దిగా

చదువనూ రాయనూ నేర్పింది. తన కర్చుతో స్కూలుకి పంపాలని చూసింది. అప్పటికి నేను బాగా పెద్దదాన్ని. నా పద్ధెనిమిదవ ఏటనే సిజరేను వివాహంచేసుకుని మిన్ని సోటా వచ్చేశాను. అక్కడ వండడం, వుతకడం, నేలలు తోమి కడగడం నాపని. ఇదిగో యిలా వున్నాను.'' చేతులు కట్టుకుంటూ సన్నగా నవ్విం దామె. ఆ నవ్వుచూస్తే కష్టించి పనిచేసి సంతోషంగా వున్నస్త్రీగా కనిపించింది. బ్రతికినదానిపట్ల నేరాలు చెప్పడాని కేం లేదు; విచారపడ డాని కంతకంటే ఏమీ లేదు.

1908లో అమెరికాకు కొత్తగా వచ్చినప్పుడు రోజా మాండవీ పద్ధెనిమిదిసంవత్సరాల నూత్నవధువు. పంథొమ్మి దోసంవత్సరంలోకి అడుగుపెట్టేనాటికి మిన్నిసోటా మైనింగు కేంద్రంలో పదహారుగురికి వండి వడ్డిస్తూం దామె. నా చిన్న తనంనుండీ నాకు తెలిసిన యిటాలియన్ కుటుంబాల పోకడల లోనే యీ మాండవీల జీవితంకూడ సాగింది

1900–1915 సంవత్సరాలమధ్యన అమెరికాకు దరిదాపు మూడుమిలియన్ల ఇటాలియనులు వలసవచ్చారు. కొందరు కుటుంబాలుగా వచ్చారు. కాని, చాలామంది, కూడా స్త్రీలు లేని వంటరిగాళ్లే. వీరిలో కొందరికి పెళ్ళిచేసుకొనే వయస్సుకూడ లేదు. కొందరు భార్యాబిడ్డలని వెనక వదిలి వచ్చారు – ఇల్లూ వాకిలీ అమిరాక తీసుకురావచ్చునని. మిగిలినవారు యువకులు. కొంత ధనం సంపాదించుకుని తిరిగి యిటలీకి పోయి స్థిరపడాలన్న వుద్దేశంతో వచ్చిన

వారు. అందరికీ కావలసినదీ, కోరుకొనేదీ ఒకటే - స్త్రీల సాంగత్యం, అలవాటైన పరిసరాలు. దానివల్లనైనా ఒంటరి తనం మరిచిపోగలం అని. ఇటాలియన్ కుటుంబం యివ్వ గలిగిన ఆదరణకి ఎంత ఖరీదైనా యివ్వడానికి సంసిద్ధులు వీరు. అలాంటిచోట అయితే తమ యింట్లో వండేలాటి భోజనం తమ యింట్లోలాగే వడ్డిస్తారు. తృప్తిగా వుంటుంది.

ఈ అవసరం ఆదుకుందుకనే 1900 నుంచి ఓ పాతిక సంవత్సరాలదాకా అమెరికాలోని ప్రతిఇటాలియన్ కుటుంబం విడిమగవారికి భోజనంవసతి కల్పించేది. సాధారణంగా ఈ యిళ్లు విశాలంగా, గొడవగొడవగా, సంతోషంగా వుండే పెద్దకుటుంబాలలాగా వుండేవి. కొన్ని సమయాలలో (ఎప్పుడో ఒకప్పుడు) ఈ కుటుంబాలు తిన్నగా జరిగేవి కాదు. మంచి అయినా, చెడు అయినా, యింతమంది బాధ్యత యింటియిల్లాలిపై పెట్టేభారం మాటలలో చెప్తే నమ్మశక్యంకాదు. ఇటలీలో కొన్ని సందర్భాలలో జంతువులకంటె ఎక్కువ పనిచేసేవారు స్త్రీలు. ఆ పనికంటే కూడ యిక్కడిది ఎక్కువే అనిపిస్తుంది.

కొన్ని సందర్భాలలో భర్తా, తన సుగుణాలే వారి నిలా యిరకాటాన పెట్టేవి. ఇటలీలో దారిద్ర్యం అనుభవించారు. సూర్యోదయంనుంచి సూర్యాస్తమానందాకా పనిచేసినా బ్రతికుండడానికి చాలినంతే పండించగలిగేవారు. అమెరికాకు వచ్చాక, తమశ్రమకి ఫలితం కనిపిస్తుందని తెలిసింది. మంచినేలలో పాతిన విత్తు ఫలించుతుందని

తెలిసింది. ప్రతిరోజు శ్రమకీ డాలర్లూ, సెంట్లూ కనిపిస్తాయి. ఈ అనుభవమే కొత్తదిగా వుంది. ప్రతిరైతుకీ ఇది ఆశయాల ఫలితం. ఈ పరిస్థితులలో, వీరు శ్రమపడి డాలర్లు సంపాదించాలని అనుకోవడం సహజమే. లోభత్వం, ధనలాలసతా కాదు యిలా యిటలీలోకంటె ఎక్కువగా వీరిచేత పని చేయించినవి. వీటన్నిటికంటే, సాధారణంగా ఫలవంతమైన పనిపట్ల రైతుల కుండే ప్రేమకి నిదర్శన.

ఇతరులకి ఆహారం పెట్టడం అన్నదిలాంటి ఫలవంతమైన కృషి. అందుకే కొందరిని యింట్లో అతిథులుగా తీసుకోవడం. దాని కింకో కారణంకూడా వుంటుంది. ఒక కుటుంబం వుందంటే - తలదాచుకొందుకు స్థానంకోసం చూసేవారి వత్తిడి దానిమీద ఎక్కువే. ఒక పరిసరంలో ఏభైఅరవైమంది అవివాహితులైన మగవా రుంటే - అక్కడ రెండో మూడో యిటాలియన్ కుటుంబా లుండేవి. ఇళ్ళల్లోకి తీసుకోమని బ్రతిమాలేవారు. ఇల్లాలికి సహాయం చేస్తాం అని ఎంతో ప్రాధేయపడేవారు. ఒక గదిలో యిద్దరూ, నలుగురూ వుండడానికి కూడా అభ్యంతరం చెప్పేవారు కాదు. ''దయచేసి నన్ను యింట్లోకి తీసుకోండి గార్డరోబా, నన్ను గురించి బాధపడే నాతల్లికోసమైనా తీసుకోండి. ఇలా మీయింట్లో వున్నాననీ, మీరే నాతల్లి అనీ రాస్తే ఎంతో సంతోషిస్తుంది'' అంటూ బ్రతిమాలుతారు.

మానవత్వం, డబ్బు చేసుకొందామన్న కోరికా కలిసి యింట్లోకి చాలామందిని తీసుకునేలా చేసేవి. పెద్దపెద్ద యిళ్లు

అద్దెకు తీసుకుని ఒక్కొక్క గదిలో ఇద్దరుముగ్గుర్ని అట్టే పెట్టేవారు. పెద్ద భోజనపుమేజాలు పెట్టేవారు. పీపాలకొద్దీ మద్యాన్ని కొని, యింటి యిల్లాలికి పనిపెట్టేవారు.

ఆరునుంచి పన్నెండుగురిదాకా యీకుటుంబాలలో వుంటూవుండేవారు. తండ్రి మిల్లులోనో, గనిలోనో పనిచేస్తూ వుంటాడు. కొంచెం సమయం చిక్కితేనూ, చేయాలని తోస్తేనూ - భార్యకి యింట్లో సహాయం చేసిపెట్టేవాడు. ఇంట్లో మగవాడు రోజుకి పదిగంటలు పనిచేసేవాడు. మధ్యలో విశ్రాంతికూడా తక్కువే. ప్రతిదినం పన్నెండు గంటలకాలం యింట్లోనే వుండడు. అందుకని భోజనానంతరం భార్యకి సహాయం చేయడం అరుదే.

ఇలా యింట్లో మనుషులను పెట్టుకుంటే, యింటి యిల్లాలు, తన కుటుంబానికికాక, యింకో ఎనమండుగురికి వండి వడ్డించడమేకాక, వారి బట్టలుసహితం వుతికేది. రొట్టె కాల్చి, మధ్యాహ్నం భోజనాలు అమర్చి, యిల్లు శుభ్రంగావుంచేది. ఉదయం అయిదుగంటలకి ప్రారంభమయే ఆమెపని రాత్రి పదకొండుగంటలకి ముగిసేది. ఇదంతా... గుడ్డలుతికే మిషనులు, విద్యుత్ యిస్త్రీపెట్టెలు, హీటర్లు, పొయ్యిలు లేని రోజులలో.

ఇంకోశిశువు జన్మించేటట్టయితే – ఆ ఆఖరుక్షణం వరకూ పనిచేసేది. ప్రసవానంతరం రెండువారాలు ఏపనీ చేసేది కాదు. తరువాత యీకొత్తభారంకూడా పాతపనికి జతచేరేది.

'ఈపనంతా ఎందుకు చేయాలి?' అని మీా రడగ వచ్చు. 'బట్టలు వుతకడాని కెవరినేనా పెట్టుకోవచ్చుకదా?' సమాధానం : ఆచారం, అలవాటు. ఈ కొత్తప్రపంచానికి యిటలీలోని ఆచారాలు, అలవాట్లు తీసుకువచ్చిం దామె. ఇటలీలో మగవాని బట్టలు వుతికి వారిని శుభ్రంగా వుంచ వలసిన బాధ్యత స్త్రీలది. ఆరోగ్యంగా వున్న ఏవనితా యింటి గుడ్డలు వుతకడానికి బయటికి పంపడం అన్నది వూహించనైనా లేదు.

ఈ స్త్రీలకి యింకోభారంకూడా వుంది. వీరి భర్త లని ఓపట్టాన సంతోషపరచడం కష్టమైన పని. ఎంతైనా చాకిరీ చేయించుకుంటారు. వారి అవసరాలకి అర్థం, అంతూ లేదు. జేబులో డబ్బు వుండడం, ఖర్చుచేసే ధోరణి వుండ డంతో తినడందగ్గరనుంచి కోరికలే. అందరికీ నచ్చే భోజనం తయారుచేయడం చేయలేని పని. టోనీకి చేపలు నచ్చవు. ఒకరకం మాంసం ముట్టుకోడు గియొవన్నీ. ఇంకో ముఖ్య మైన వంటకం నచ్చడు రాబర్టో. ఆల్ఫ్రెడోకి కొన్నిరకాల కూరలంటే అసహ్యం. తరుచుగా యింటి యిల్లాలు ఒక సాయంత్రం పలుపదార్థాలు వండవలసివచ్చేది.

వలసవచ్చిన తల్లి పడే పాట్లలో యివన్నీ కొన్ని మాత్రమే. ఇంకా వున్నాయి. అది శారీరకంగానూ, మాన సికంగానూకూడ పీడించేదే. ఇంటిలో స్థానం యిచ్చిన మగవాళ్లు స్త్రీలు లేనివాళ్లు. గుంపుగా వుంటే - చాలా మోటుగా ప్రవర్తించే సామాన్యులే. వీరికి నామమాత్రపు

విద్యాభ్యాసమే వుంది. మనోవికారాలకి ఆనకట్టలు కట్టే తత్వం లేదు. శ్రమపడి పనిచేస్తారు. వీరిలో కొందరు అవిధేయులుగా, బాధాకరంగా ప్రవర్తించడంకూడా కద్దు. స్త్రీలపట్ల అతిస్నేహభావం ప్రకటించేవారు. స్త్రీలూ పిల్లలూ వున్నప్పుడే మోటగా మాట్లాడే రకాలు. ఇంట్లో అందరూ ఒకేచోట వుండవలసిరావడంతో ఇంటియిల్లాలు యిలాంటి వాళ్ళ ప్రభావంనుంచి తనపిల్లలని కాపాడలేకపోవడం కూడా వుంది.

రోజా ఈ పద్ధతికి ఒక దారి కనిపెట్టింది. తన పిల్లలు వుండగా యింట్లో ఏ మగవారూ మోటగా మాట్లాడ కూడదని ఆజ్ఞ వేసింది. "డబ్బుపెట్టి పేకాడడం నాయింట్లో కూడదు" అని ఒక రూలు పెట్టేది తన యింట్లో వుండ దలచుకొన్నవారికి. "త్రాగుడు కూడదు, మొరటుతనం కూడదు. ఇలాంటివి చేస్తే, తక్షణం నాయిల్లు వదలిపోవాలి."

ఈ విషయంలో ఖరాఖండీగా వుండడంతో, ఆమె యింట్లోకి వచ్చినవారు ఆమెమాట వినకతప్పదు. పధ్నాలుగు సంవత్సరాలలో ఒకేఒకసారి అలా బలవంతం చేసి ఒక డిని పంపేయవలసిన అదను కలిగింది.

పధ్నాలుగుసంవత్సరాలపాటు కనీసం పదిహేను మందినైనా యింట్లో అట్టేపెట్టుకుంది రోజా. ఎవరి సహాయం లేకుండా వారికి వండి, వడ్డించి, వారి బట్ట లుతికిపెట్టుతూ వుండేది. ఎవరేనా అనారోగ్యంగా వుంటే నర్సుగా, తల్లిగా వారి నాదరించేది. ప్రతిరోజూ మూడుపూటల భోజనానికీ

ఎవరికి కావలసినది వారికి వండిపెట్టేది. ఇంట్లో చేసిన రొట్టెలు, తినుబండారాలు, కూరలు, చేపలు ఎక్కువగా వండిపెట్టేది. వైన్, కాఫీ, వెన్నలకి లోటే లేదు.

రోజాకి ఇరవై ఆరు సంవత్సరాలు వచ్చేసరికి అప్పటికి ఏడు సంవత్సరాలుగా పైవారికి భోజనాలు పెట్టుతూంది. తన నాల్గవ పిల్లని కూడ ప్రసవించింది. అదే ఆమె ఆఖరు కానుపు. ఈ పిల్లలు జీవితం కష్టతరం చేసినా ఆనందం యిచ్చారు. రోజా మాండవీ చాలా సహృదయ. పిల్లల నెంతో ప్రేమతో సాకింది. పరిశుభ్రంగా వుంచి నమ్రత నేర్పింది. మంచి చెడుల వ్యత్యాసం తెలియజెప్పేది. డబ్బు విలువ, పనిలో వున్న గౌరవం తెలియజెప్పింది.

ముప్ఫయిఒకటి రాగానే పైవారిని యింట్లో పెట్టుకోవడం మానేసింది. ఆమె బహుముఖప్రజ్ఞ సంపాదించింది. దూరదేశంలో స్త్రీ లుండిపోయిన మగవారికి తల్లి అయింది. తన నలుగురు పిల్లలకీ భర్త చక్కని యిల్లూ వాకిలీ అమర్చడానికి సహాయం చేసింది. పిల్లల కోసం, భర్త కోసం తనకాలం అంతా వినియోగించే హక్కును సంపాదించుకున్న ఘనత ఆమెది. ఈ ఘనత కోసం పధ్నాలుగు సంవత్సరాలు శ్రమించింది. అయినా, అమెరికా యీ అవకాశం కలిగించినందుకు తా నదృష్టవంతురాలనని తల పోసింది.

మాండవీలతో భోజనం ఎంతో హాయిగా వుంది నాకు. అది ఎంత తృప్తి నిచ్చిందంటే, మళ్ళీ వారం భోజ

నానికి రమ్మని ఆహ్వానిస్తే తక్షణం ఒప్పుకున్నాను. ఈ సారి రాబర్ట్ మాండవీ నాకు ఆతిథ్యం యిస్తాడు. అతని యిల్లు సెయింట్ హెలెనాలో వుంది. ఇక్కడ చక్కని వంటకాలు, పానీయాలు, అన్నిటినీ మించి వారి స్నేహశీలత నన్ను ముగ్ధుణ్ణి చేశాయి.

ఓక్ వృక్షాల క్రింద గడ్డిలో కూర్చుని కాఫీ తాగాం. అలా మాట్లాడుతూ కాఫీ తాగుతూనే ఓ క్షణంపాటు మాటాడకుండా వుండిపోయాను నేను–మాండవీలనీ, వారి పరిసరాలనీ తిలకిస్తూ.

ఆ ద్రాక్షతోటలు, ద్రాక్షగుత్తులు, దూరంగా కనిపించే కొండలు చూస్తున్నాను. ఆకాశం నిర్మలంగా వుంది. సూర్యుని వేడి వెచ్చగావుంది. గాలి కూడా స్తబ్ధంగా వుంది. తల్లిదండ్రులు, తాత అవ్వలు విశ్రాంతి తీసుకుంటూంటే పిల్లలు ఆటలు ఆడుతున్నారు.

నా కెంతో సంతోషంగా వుంది. అమెరికాలో ఈ ప్రాచీనమైన, అందమైన ద్రాక్షతోటలో మూడుతరాల మాండవీలు వున్నారు. రోజా, సిజరె విద్యావ్యాసంగ మేనా లేని వలసదారులు. కలిసి పనిచేసి ద్రాక్షతోట వేశారు. ఇటలీలో ఇలాంటి వన్నీ ధనికులైన భూకామందుల కే పరిమితం అయివుండేవి. కాని ఈ కొత్త ప్రపంచంలో యిలాంటివి సాధారణులైన రైతులకి సహితం అందుబాటులోవున్నాయి.

సిజరే, రోజా తమ శ్రమఫలితాలు అనుభవించుతూ వుండడం కూడా నాకు ఆనందదాయకం అయింది. తమ తాతలనాటి భూమినుంచి విడివడివచ్చి యిక్కడ అమెరికనులుగా రూపాంతరం చెందారు. అమెరికా వారికి అవకాశాలు కల్పించింది. వారు ఈ పెంపుడు భూమికి వన్నె తెచ్చారు. తమకు సహజమైన సుగుణాలని నిలబెట్టుకున్నారు. తమ ఆచారాలను నిలబెట్టుకున్నారు. ... చివరిదాకా తమ మృదుత్వాన్ని, ఔదార్యాన్ని నిలబెట్టుకున్నారు - నిజమైన రైతుల్లాగ.



# 4

# ద్రాక్షతోటగాళ్ల గురువు

# లూయీ మార్టినీ

జెనోవా దగ్గిర ఉన్న పెట్రా లిగురె నుంచి తన పదమూడవఏటనే, 1900 లో సాన్ ఫ్రాన్ సిస్ కోకి వచ్చాడు లూయీ మార్టినీ. ఇతని తండ్రి—నిపుణుడైన పాదరక్షుల తయారీవాడు - 1894 లోనే వచ్చేశాడు. లూయీ పినతండ్రిరక్షణలో వచ్చాడు. తండ్రీ కొడుకూ తక్షణమే చేపలవ్యాపారం ప్రారంభించారు. కష్టపడి పని చేశారు; సామాన్యులుగానే వుండిపోయారు; విజయం గాంచారు: అంటే ధనార్జనచేశారు. కాని యిద్దరికీ యిలా అమ్మడం కొనడంద్వారా ధనం సంపాదించడంలో సంతృప్తి

లభించలేదు. తండ్రి చాలా నేర్పరి. ఎన్నో సృష్టించడంలో వున్న నేర్పు డబ్బుచేయడంలో లేదతనికి. కొడుకుకూడా కొత్తవి కనిపెట్టడంలో నేర్పరి. తెలివైనవాడు. చేపలమ్మడంలో ఆనందంగా వుండలేకపోయాడు. అందుకని 1906 లో మద్యం తయారుచేసేవారుగా మారుదాం అనుకున్నారు. ఈవ్యాపారంలో బాగా డబ్బుకూడా వస్తుంది. ఇదీ ముఖ్యమే కదా? దీనికంటే ముఖ్యమైనది-తండ్రీ కొడుకూ తమ నేర్పు నంతా వినియోగించడానికీ, సంతృప్తిపడడానికీ అవకాశం వుంది యీపనిలో. ఎన్నాళ్లు బ్రతికినా, ఎంతకాలం అయినా కూడా, చేసినదానికంటె మంచి సారాయం సృష్టించడానికి ఎప్పుడూ అవకాశం వుంటుంది.

1906 లో ఈపనినిగురించి బాగా నేర్చుకురావడం కోసం లూయీ మార్టినీ యిటలీకి తిరిగివెళ్లాడు. సారాయి చేయడం నేర్పే పాఠశాలలలో కెల్లా శ్రేష్ఠమైనదని పేరు గాంచిన ఆల్బాలో, మంచి విద్యార్థిగా పేరు తెచ్చుకున్నాడు. ఒక సంవత్సరం గడవకముందే, కాలిఫోర్నియాకు తిరిగివచ్చి, ద్రాక్షలు పెంచడం ప్రారంభించాడు. ఈవృత్తిలోకి పూర్తిగా ప్రవేశం చేశాడు.

నిపుణులైన పనివారికి తాము చేసే పనిలో వ్యక్తిగతమయిన ఆనందం లభిస్తుంది. తమ అభిప్రాయానుగుణంగా ప్రతి చిన్నవివరమూ సరిగా వుండాలి. ఈతోట పెంచదలచుకొంటే దాన్ని నాటడానికి అనువైన స్థలం కుదరాలి. విత్తనం తనే ఎంచుకోవాలి. తనే నాటాలి. అవి

పెరుగుతూవుంటే కళ్ళలో వత్తులు వేసుకుని చూడాలి. పిల్లలవిషయంలోలాగే ద్రాక్షలవిషయంలోకూడా ముందు సంవత్సరాలలో తగిన జాగ్రత్త తీసుకోవాలి. ఇదొకకళగా పనిచేసేవారిలాగే వుంటారు. చాలా గణనీయమైన పద్ధతి. కాని దాని ఫలితంగా ఏఒక్కడూ నిపుణుడైన ద్రాక్ష పెంపకందారుడు కాలేడు. అన్నీ త్వరితగతిని జరిగే అమెరికాలోకూడా యిది సంభవంకాదు. అదృష్టం కలిసివచ్చినా సరే, ఓర్మితో యిరవైసంవత్సరాలు కృషిచేస్తేతప్పించి – మంచి ద్రాక్షసారాయం అద్భుతమైన పానీయంగా రూపొందదు.

కాని లూయిూ మార్టినీకి దారిపొడుగునా అదృష్టం ఎదురవలేదు. ఇతని ద్రాక్షతోటలు పదిసంవత్సరాలు పెరిగాయి. యునైటెడ్ రాష్ట్రాలలో మద్యపాననిషేధం వచ్చింది; నిషాపదార్థాలు తయారుచేయడం, అమ్మడం, సరఫరాచేయడంవంటివన్నీ రాజ్యంమొత్తంమీద నిషేధింపబడ్డాయి. 1920 లో ఇది జరిగింది. తన సుందరస్వప్నాన్ని వెనక్కినెట్టాడు లూయిూ మార్టినీ. 1933 లో ఈ చట్టం మారింది. ద్రాక్షతోటలు కొన్నాడు; బట్టీలు పెట్టాడు. పూర్తిగా వ్యాపారదృష్టితో పని ప్రారంభించాడు.

మార్టినీని చూడ్డానికి చాలాకాలం ముందుగానే అతని పేరు విన్నాను. అతని మద్యాలు చవిచూశాను కూడా. భోజనాలదగ్గర, మద్యపానకేంద్రాలదగ్గర ఎక్కడ సారాయిమాట వినబడినా, అక్కడంతా మార్టినీని గురించి

చెప్పుకోవడం—అతను ఈ విద్యలో గురువని. చిన్నతనంలో తండ్రితో కలిసి సాన్‌ఫ్రాన్సిస్కోలో చేపలు అమ్ముతూండేవాడనీ, చాలా మంచివాడనీ, కొద్దో గొప్పో చదువు సంధ్య లున్నవాడు అనీ, సెయింట్ హెలెనాలోకల్లా అందమైన యిల్లు కట్టుకున్నాడనీ, ముక్కుకి సూటిగా పోతాడనీ, కోపిష్ఠిఅనీ, ఎదుటివారి ఆలోచనల నిట్టే పసికట్టగల తెలివున్న జనోవావ్యక్తిఅనీ చెప్పుకోవడం విన్నాను. ఎవరూ అతన్ని పూర్తిగా అర్థంచేసుకోలేదని అనిపించింది నాకు. అయినా అందరూ అతన్ని 'లూయీ' అంటూ పిలిచేవారు.

నే విన్నదాన్నిబట్టి మార్టినీ చాలా సత్యశీలు డని పించింది. నాకు యిటలీనుంచి వచ్చిన వలసవారిలో గమ్మత్తయినవారంటే ఉత్సాహం ఎక్కువ. అందుకే యితన్ని చూడాలని తహతహలాడాను.

ఇ దెలా సాధ్యం? చాలా ప్రముఖుడు. డబ్బూ, గౌరవం వున్నవాడు. విరామమెరుగని పని వుండవచ్చు అతనికి. నేను సాధారణమైనవాణ్ణి. అమ్మడానికీ, కొనడానికీ కూడ నాదగ్గ రేం లేదు. నా కుతూహలం అంతా అతన్ని చూడాలనీ, వీలుంటే అతన్ని బాగా తెలుసుకోవాలనీ. నన్ను చూడ్డం పడదంటాడేమో అన్న భయం వుంది. కాని ప్రయత్నిద్దాం అనుకున్నాను. ఎలాగైనా ఒకసారి మాట్లాడే అవకాశం యివ్వమని రాశాను.

మా తొలి సమావేశం అంత గొప్పగా లేదు. సెప్టెంబరులో ఒక ఆదివారంనాడు సెయింట్ హెలెనాలో

వున్న అతని ద్రాక్షతోటలో కలుసుకుందుకు నిర్ణయం జరిగింది. ఆరోజు అనుకోకుండా కొన్ని ద్రాక్షలను దింప వలసిన అగత్యం ఏర్పడింది. మార్టినీ వాటిని కోయించడం, తొక్కించడం, పిండించడం వంటి పనులను శ్రద్ధగా పరిశీలిస్తున్నాడు. రెండున్నర గంటలసేపు ఓర్పుతో ఆ ద్రాక్షలు ఒత్తించే గదిలో కూర్చున్నాను. అతను పనిపూర్తి చేసుకుని వచ్చేదాకా వేచివున్నాను. ఈ వ్యవధిలో ఒకే ఒక సారి నా ఉనికిని అతడు గుర్తించాడు. అదేనా ఒక్క మాటేనా అనకుండా, చేస్తున్న పనినైనా ఆపకుండా తల నాకేసి తిప్పడంవల్ల తెలిసింది.

ఆఖరుకి నా దగ్గరికి వచ్చేసరికి ఆరున్నర అయింది. నన్ను భోజనానికని ఆహ్వానిస్తాడేమో అని ఆశించాను. అదేం జరగలేదు.

"మిస్టర్ పెల్లిగ్రినీ, క్షమించు, నేనింత హడావిడిగా వున్నందుకు. ఈ కాలంలో ద్రాక్షతోటలో, బట్టీలలో పని ఎలా వుంటుందో ఎవరం చెప్పలేం. ఇలాంటి పనులలో కొన్ని ఎవరికీ అప్పచెప్పేవికూడా కాదు. ఆలస్యం అయింది. నాకు చాలా అలసటగా కూడా వుంది. రేపు సాన్‌ఫ్రాన్సిస్కోకి వెళ్ళాలి. నీవూ అక్కడికి వస్తున్నావేమో? కదూ? అక్కడ భోజనం కలిసి చేద్దాం."

అతనిమాట కాదనలేక ఫయర్‌డి ఇటాలియాలో కలిసి భోజనం చేయాలని నిర్ణయించుకున్నాము.

మర్నాడు పన్నెండు కాకుండానే ఫయర్‌డి యిటాలియాకి వచ్చేసరికి మార్టినీ అక్కడ వున్నాడు. వస్తూ

పోతూన్న వారిని కులాసాగా పలకరిస్తూ, సన్నగా కాస్తున్న ఎండలో యిటూ అటూ తిరుగుతున్నాడు. సాన్ ఫ్రాన్సిస్కోలో వున్న ఇటాలియనులు లాయర్లు, బ్యాంకర్లు, డాక్టర్లు, వ్యాపారస్థులు. నన్ను చూసీ చూడగానే చేయి జాపి ముందుకి వచ్చాడు. ఇద్దరం కలిసి లోపలికి వెళ్ళాం.

ఈ హోటలు అంత పెద్దదీ కాదు; అతివిలాసప్రదమైనదీ కాదు. మార్టినీ అంత ఆలోచించకుండానే దాన్ని సూచించాడు—ఈ విషయం పెద్ద సమస్యగా తీసుకోనక్కరలేదన్నట్టు. చాలాకాలం క్రిందట, దరిదాపు ఏభయిసంవత్సరాలక్రితమే సాన్ ఫ్రాన్ సిస్కోకి వచ్చేసిన ముసలియిటాలియనులందరూ ఈహోటలువిషయంలో యజమానికున్నంత శ్రద్ధాసక్తులు చూపుతూవుంటారు. వీరందరూ ఏకకాలంలో వృద్ధిచెందుతూవచ్చారు అమెరికాలో. ఇది వారి హోటలు. ఈ భోజనశాలలోనే ప్రముఖసంఘటనలని తిలకించారు; ప్రముఖులైన దేశీయులని వినోదకాలక్షేపానికై పిలిచారు. వివాహానికి ముందు తమ ప్రియురాళ్ళనిక్కడే కలుసుకుంటూ వుండేవారు. వాదప్రతివాదనలు జరుపుకొంటూ, అభిమానించుకుంటూ, ద్వేషించుకుంటూ, ఒకే బల్లదగ్గిర చేరిన ఇటాలియను లెంత స్వేచ్ఛగా గోలగా వుంటారో అంత స్వేచ్ఛగానూ యిక్కడ వుంటారు.

తమ కనుగుణంగా, తా మభిమానించేవిధంగా యీహోటలుని రూపొందించుకుని తమ ఉన్నతప్రమాణాలనే దీనికీ తెచ్చారు. ఈప్రమాణాలకి అర్థం వుంది. పెద్ద

పాత్రలతో సూప్‌వంటి పదార్థాలు పెట్టాలి. ఎక్కువగా ఆకుకూరలూ, కూరగాయలూ వడ్డించాలి. వాడే ఆలివ్ నూనె శుద్ధమైనదిగా వుండాలి. వండే మాంసమూ, గుడ్లూ, కోళ్ళూ—అన్నీ సరికొత్తవిగా వుండాలి. కూరగాయలు పెద్ద పళ్లేలలో పెట్టి ఆలివ్‌నూనె, ఉప్పూ మిరియాల పొడితో తెచ్చిపెట్టాలి. మంచి రొట్టె, మంచి పానీయాలు, పండిన పళ్లు, ప్రత్యేకమైన వంటకాలు, వడ్డించేందుకు మగ వాళ్ళు, పరిశుభ్రత – అంతా వుండితీరాలి... వీటిలో ఏమాత్రం లోటు కన్పించినా సొంతగాళ్ళకి కష్టకాలమే! భోజనం చేస్తూచేస్తూ లేచి నిలబడి, హోటలుసొంతదారుని గట్టిగా తిట్టాడు ఒకాయన—మంచి పళ్ళు పెట్టలేదని. ఇది నేను చూసిన విషయం.

ఈ ఫయర్ – డి – ఇటాలియాకి వ్యక్తిత్వంయిచ్చిన పెద్దలు తప్పుకోవచ్చు. ఇంకోఏభయిసంవత్సరాలు గడిచే సరికి యిక్క డీనాడు తిన్న తరంవారి తరువాత ఐదారు తరాలవారు ఈబల్లలముందు కూర్చోవడం సంభవించ వచ్చు. 'వలసవారు' అనుకొన్న వ్యక్తులిక లేనేలేరు. కాని వారి కొమార్తెలు, కొడుకులు, ఈ ఇటాలియన్ పులుసులు, ముఖ్యమైన వంటలుమాత్రం వుంటూనేవుంటాయి. రేపటి అమెరికాకి తమ సౌందర్యాన్ని అందిస్తూనేవుంటారు వీరు. వీరిలో యిటాలియనుల ఔన్నత్యం, సుగుణాలూ నిలచి, వారిలోని బ్రతకాలన్న కోర్కె, జీవితపు ఢక్కామక్కీలను హాయిగా మోయగల లక్షణం నిలిచేవుంటాయి.

మేం కూర్చున్న కొద్దిసేపటికే పక్కబల్ల దగ్గిర కూర్చున్న ఒక వ్యక్తికేసి తిరిగి మార్టినీ అన్నాడు, "ఏమోయ్, నీకు వెన్న యిష్టమేనా?"

మేం కూర్చోడానికి ముందే అతన్ని చూశాను. మెక్సికను రైతులాగ వున్నాడు. ఏదో కొత్తగానూ, యిబ్బందిగానూ కనబడ్డాడు ఈ హోటల్లో. అతన్ని చూసి, అతని ముఖకవళికలు చూసి—యిక్కడి కెందుకొచ్చాడా తినడానికి అనుకున్నాను. మార్టినీ పలకరింపుతో నాకు ఆశ్చర్యం కలిగింది; కుతూహలం హెచ్చింది.

ఓక్షణం ఆగిపోయాడు-ప్రశ్న అర్థంకానట్టు. ఇంతట్లో మార్టినీ ఆర్డరుప్రకారం ప్లేట్లతో వెన్న తెచ్చిపెట్టగానే అప్పు డర్థమైనట్టు—"థాంక్యూ - యిష్టమే" అన్నాడు. ఈపనికి నాకు అర్థం తెలియకపోయినా మాట్లాడక వూరుకున్నాను. మార్టినీ తరువాత చెప్తాడేమో? భోజనం ముగించి, వెళ్ళడానికి సిద్ధం అవుతున్నాం. గుమ్మంకేసి నడుస్తూంటే—నాభుజంమీద ఓ చెయ్యి పారేస్తూ, "మిస్టర్ పెల్లిగ్రినీ, వినండి, నా కొక పని వుంది. చాలా ముఖ్యమైనది. ఈ మధ్యాహ్నం అంతా పట్టవచ్చు. నేను వెన్నయిచ్చిన మెక్సికను ఏదో అవస్థలో వున్నాడు. మనతో భోజనం చేయమన్నాము. కాని అతనికి మన పనికి అంతరాయం కలిగించడం యిష్టంలేదు. అందుకే మనకి ముందుగానే అతని భోజనం ఆర్డరుచేశాను. ఈ దేశంలోకి రావడం విషయంలో ఏదో గొడవ వచ్చింది. అధికారులు ప్రశ్నిద్దామని చూస్తు

న్నారు. పెద్ద కుటుంబీకుడు. చాలా మంచివాడుకూడా. చాలా మంచి పనివాడు. అతనితో కలిసి నేనూ అధికారు. లని చూడాలని నిర్ణయించుకున్నాను. దీనివల్ల అతనికి లాభి స్తుందో లేదో చెప్పలేను. కాని ఏమాత్రమైనా సహాయం చేసే అవకాశం వుంటే, చేద్దామని.'' ఈ చివరిమాట విన గానే-ఆ మెక్సికన్ యిక గట్టెక్కినట్టే అనిపించింది నాకు. తరవాత్తరవాత, మార్టినీని ఎన్నోసందర్భాలలో చూసే అవకాశం చిక్కింది కాని ఎప్పుడూ ఆయనది ఒకటే దారి-ముందుకి-అని గుర్తించాను. ఎప్పుడూ ఒకే మానసిక పరిస్థితి-సరదా అయినది. అలా అని అనుమానయుతమైన అవకా శాలు లేవని అనడం కాదు. చాలా జాగ్రత్తగా ఆలోచించి మరీ ముందడుగు వేసే తత్వం. ఎప్పు డడుగు వేసినా అది ముందుకే.

మర్నాడు మధ్యాహ్నం ఐదు గంటలకి కలుసుకుని తిరిగి సెయింట్ హెలెనాకి వచ్చాం. అతని కారులోకి అడుగు పెడుతూండగానే ''ఆ మెక్సికనుకి ఏదో కొంచెం మంచే చేయ గలుతా ననుకుంటాను. దాని విలువెంతో తెలియదు. కాని ప్రయత్నిస్తాను.'' అన్నాడు.

''అసలువిషయా లేమిటో అడగవచ్చా?''

''విషయాలా? అవును, అసలు విషయాలు'' అంటూ సణుక్కుని ముఖంలో విసుగు గోచరిస్తూంటే అన్నాడు: ''ఇవిగో. యునైటెడ్ రాష్ట్రాలలోకి యితడు వచ్చిన పద్ధతిలో ఏదో తప్పుంది. ఇటాలియను ప్రభుత్వాధికారి భాషలో

ఇతని కాగితాలు సరిగ్గా లేవు. అయితే ఎవరి పేపర్లు సరిగ్గా వున్నాయి! నీవున్నాయా? నా వున్నాయా? అన్నీ సవ్యంగా వున్న ఒక్క మనిషినైనా-ఏదీ చూపించు నాకు!"

"నిజమే. వాటి నెవరూ పట్టించుకోవడం లేదు"అన్నాను.

"సరిగ్గా అదే. ప్రతి పంటటైములోనూ, వారు తినే ఉప్పుపాటి విలువచేయని ఎందరినో కూలికి పెట్టుకోకతప్పడం లేదు. వారికప్పుడేనా పని చేయాలన్న కోర్కె వుందో లేదో గాని, అది కాస్తా ఎప్పుడో పోయింది. ద్రాక్షల పెంపకంలో అతిముఖ్యమైనస్థాయిలో యిలాంటి వారిమీద ఆధారపడవలసినగతి పడుతూంది. ద్రాక్షపంట పండించడం చాలా జాగ్రత్తగా చేయవలసిన పని. పచ్చిపిందెకీ, పండినదానికీ తేడా తెలియదు వీళ్ళకి. నేర్చుకుందామన్న కుతూహలం కూడా లేదు వీళ్ళకి. వీరందరి పేపర్లూ చాలా సూటిగా వున్నవే. దానివల్ల పనిచేసే హక్కు కలుగుతూంది వారికి. పని లేక పోతే ప్రభుత్వం యిచ్చే భత్యాలు దొరుకుతున్నాయి; ఒక వయస్సు రాగానే పింఛను పుచ్చుకునే సుఖం కలుగుతూంది. పేపర్లు సరిగా లేని కారణంగా యీ మెక్సికనుకి ఈ హక్కులేమీ లేకుండా పోయాయి. మంచివాడు కావడం, నమ్మకస్థుడు కావడం, నేర్పరి అయినా నమ్రత కలిగివుండడం, సరదాగా పనిచేసే తత్వం కలిగివుండడం, పని విషయంలో టైము లెక్కచెయ్యకపోవడం...జీవితమంతా ఒక క్రమపద్ధతిలో ఉండడం-యివన్నీ వున్నా, యివేం ముఖ్యం అయినవిగా తోచదు.

"ఇవే కారణాలు మిమ్మల్ని ప్రోత్సహించి అతనికి సహాయంగా పంపుతున్నావేమో?" అన్నాను.

"అవును. అయితే అతనికి సహాయం చెయ్యడంకోసం దెబ్బలాటకి దిగాలి. అది హక్కు కాదు. మంచిదీ కాదు కదా. ప్రభుత్వ అధికారి కానీ, వ్యాపారి కానీ పరిస్థితిని వున్నది వున్నట్టుగా చూడలేకపోవడం, మార్పు సహించలేకపోవడం అన్నది గొప్ప లోటే. హక్కులను గురించి గట్టిగా వాదిస్తూ అసలు నిజం మరిచిపోతాం. చేసిన పనిని బట్టి కూడా హక్కులు లభిస్తాయి కదా. ఈ మెక్సికను రికార్డంతా బాగుంది. గుఱ్ఱాని కున్నంత శక్తివంతమైన కూలీ. ద్రాక్షతోటలలో ఉంటాడు. అక్కడ పనిని యితనంతగా ఎవరూ అర్థంచేసుకుని వుండరు. ఇదంతా చూశాక నేనా అధికారులకి ఇతన్ని గురించిన అనుమానాలు పోయుండాలి కదా! అతను చేసిన పనే కదా నిదర్శన? ఇక్కడున్నాడు కదా యిప్పుడు? మంచి పౌరుడుగా రాణించాడు. పేపర్ల సంగతి మరిచిపోయి హాయిగా అతన్ని పని చేసుకోనివ్వచ్చుకదా!"

"ఒప్పుకుంటాను. మీకా మెక్సికనంటే చాలా యిష్టంలా వుంది. మీ పనివారిలోకల్లా బాగా నేర్పరి అనుకుంటాను" అన్నాను.

"అవును. నాకోసం పనిచేస్తాడు. అతనంటే నాకు చాలా యిష్టంకూడా. కాని వ్యక్తిగతమైన అవసరాల కోసం కాదు సహాయంచేయాలంట. ఇలా చేసిన పని నిద

ర్శనగా వున్న ఎవరికోసమైనా నేను వాదిస్తాను. నిజానికి ద్రాక్షతోటలున్న లోయలోనివారి కందరికీ కూడా మెక్సికనులాంటి వ్యక్తులు ఎంతేనా అవసరం. మంచిమద్యాలు కాలిఫోర్నియాలో తయారుకావాలంటే, మంచి మనుషులు– కాలవ్యవధి ఎంతేనా కావాలి. మిగిలినవన్నీ మనకి వున్నాయి–మంచి సారవంతమైన నేల, వాతావరణం, అనుకూలత, నేర్పు. ప్రపంచంలోకల్లా మంచి ద్రాక్షలు పండించాం. కాని మనిషి అవసరం ఎంతేనా వుంది.''

''ఇలాంటి మెక్సికనులాంటివారా ?''

''అవును. ఈ మెక్సికనులాంటివారే. వినండి, పెల్లిగ్రినీ, నా పదమూడవఏట యిక్కడ చేపల అమ్మకం ప్రారంభించాను...అప్పణ్ణుంచి వ్యాపారంలోనే వున్నాను. నాకేభయిరెండేళ్లు. నా అనుభవందృష్ట్యా కొన్నివిషయాలు చెప్పే హక్కుంది నాకు. ప్రతివ్యాపారంలోనూ, జీవితంలోలాగే, త్వరితగతిని ధనార్జన చేయాలని. అదేనా కష్టపడకుండా. నీ స్నేహితులని వుపయోగించుకో. నీ రాజకీయ నిపుణతని వినియోగించు. నీమతం, నీకుటుంబం – ఎలాగో అలాగ గొప్పవాడివి కావాలి. పోటీలో పాల్గొనకుండానే విజయధ్వజం సమీపించు. ఈ జబ్బు, ఈ నిజాయితీ లేనితనం పనివారిలోకూడా విస్తరించింది. తాము చేసే పనికి గర్వించరు. కొంచెం పని చేసి రోజుకూలీ పుచ్చుకోవడంలో గర్విస్తారు. అంతా యిలాంటివారు కాదు. ఇక్కడ కొందరు చాలా మంచిపనివాళ్ళు వున్నారు. వారే లేకుంటే ముం

దడుగు వేయడమే కష్టం. చాలామటుకు నే చెప్పేది సత్యమే ...ప్రతిఒక్కరికీ హక్కులు కావాలి. కొందరి కీబాధ్యతలు కావాలి. నే చెప్పినట్లు మంచిసారాయిలు తయారుచేయ డానికి యిక్కడ తోటల్లోనూ, అక్కడ బట్టీలలోనూ కూడా మనుషులు కావాలి. మంచి మద్యానికి ఆ రుచి పండించిన ద్రాక్షులనుంచి వస్తుంది. ఇవి పండించడంలోనూ, కోయడంలోనూ జాగ్రత్త వహించాలి. తరవాత పంట దింపించడం, తొక్కించడం, పిండడం వస్తాయి. తరవాత నే బట్టీలోకి చేర్చి నిల్వవుంచడం జరుగుతుంది. ఎంతకాలం వుంచితే అంత మంచి పానీయం సిద్ధపడుతుంది. ఈ పనులన్నీ కూడా ముఖ్యమైనవే. వీటిలో ఏపని సరిగా చేయక పోయినా మద్యంరుచి చెడుతుంది. ఇప్పు డర్థం అయిందా నే నన్నది, మంచి వైను తయారు కావాలంటే ఉత్తములైన పనివాళ్లు కావాలి."

అత నెదురుచూచినదానికంటె ఎక్కువే అర్థం అయింది నాకు; కట్టడవ్యాపారంలో, రైలురోడ్డపనిలో పని ముట్లతో ఎక్కడ పనిచేసిన అక్కడల్లా ... మార్టినీవంటి వలసవారు నెమ్మదిగా కానరావడం మానేస్తున్నారు. పనంటే భయపడనివారు, పనంటే యిష్టపడినవారు, పనినే ఒక సృజనాత్మకకళగా భావించినవారు కంటికి కానరాకుండా పోతున్నారు.

"ఈ మెక్సికనులాంటివారు సరిగ్గా కావలసిన రకం పనివాళ్లు. ఎప్పు డేం చేయాలో, ఎలా చేయాలో తెలిసిన

వాళ్లు. వీరి కెవరూ ప్రత్యేకించి 'యిది చెయ్యి' అని చెప్ప నక్కరలేదు. తరుచు యజమానికే కావలసిన సూచన లిస్తారుకూడ. వీరిలో ఏఒక్కరికీ గడియారం వుండదు. పని పూర్తిచేసి ఇంటికి వెడతారేగాని టైమయిందని కాదు. కళాకారులకిలాగే వీరికీ పని అన్నది ఒక జీవితవిధానమని చెప్పుకోవాలి. తాము చేసే పనిలో తృప్తి కల్గుతుంది వీరికి. మంచి పానీయం తయారుచేయగలిగినప్పుడు మాకంటే వీరే ఎక్కువగా సంతోషిస్తారు."

"మీ కీలాంటివారు లేకుంటే ఈ తోటలుకూడ లేకుండాపోతాయా?" అని అడిగాను.

"నిజానికి పూర్తిగా పోవు. కొన్ని ఎప్పుడూ మిగిలి వుంటాయి. ఎప్పుడో ఒకప్పుడు త్వరగా ధనం సంపాదించా లన్న ఈ కోరిక పోతుంది. అప్పుడే మనిషికి పనిలో గౌరవం తిరిగి వస్తుంది. జీవితం చర్విత చర్వణంకదా. దీనికి అంతం అంటూ లేదు. నా విషయం అంటారా? దైనందినవిషయాలలో ఎంత తీక్ష్ణస్వభావమో, మొత్తం మీద అంత వినోదతత్వం. ఈ రోజుమీద పూర్తిగా నమ్మకం వుంచేయకు, అప్పుడే రేపుమీద నమ్మిక వమ్ము కాదు. ఇదే జీవితంపై వుండవలసిన దృక్పథం. ఈరోజు తొక్కించిన ద్రాక్షలు పదేళ్ళతరువాత అద్భుతమైన సారాయంగా అవుతాయంటే ఈలోపున ప్రతిదినం వీటిపట్ల నాకు అనుమానమేకదా-ఏమంటావు?"

అవునని ఒప్పుకున్నాను. ఏపనిలోనైనా ఉత్తమోత్తమమైనదే ధ్యేయంగా పెట్టుకునే లూయీమార్టినీ తత్వం విదితమే. ఈ సందర్భంలోనే ఆల్బావైన్‌స్కూల్లో తర్ఫీదునందుతున్నరోజులలో జరిగిందని చెప్పుకొనే ఒక కథ జ్ఞాపకం వచ్చింది.

కోర్సు పూర్తిఅయ్యాక లూయీ పరీక్షలకోసం తయారవుతున్నాడు. వైన్‌విషయంలో తుదినిర్ణయం చేస్తూన్నప్పుడు రెండు పరీక్ష లున్నాయి: లేబరేటరీపరీక్ష ఒకటి, రుచిపరీక్ష ఒకటి. ఒక పరీక్షలో ఉత్తమమైనదిగా నిర్ణయంగాంచిన వైను రెండోదాంట్లోకూడ అలాగే నిలబడకపోవచ్చు. లేబరేటరీలో మంచివి కావని నిర్ణయింపబడినవి కొన్ని, కొంతమంది కలిసి రుచిచూస్తే, రుచినిబట్టి ఉత్తమమైనవిగా లెక్కకి రావచ్చు. సరైన పనివాడే రెండిటినీ సమన్వయపరచి తెలుసుకోగలిగిన మేధావి కావాలి.

లూయీ లేబరేటరీపరీక్షలో బాగా ఉత్తీర్ణుడయ్యాడు; తరువాత రుచిపరీక్ష. అతని గురువు దగ్గరలో వున్న ఒక బట్టీదగ్గరకి తీసుకువెళ్ళాడు. పది సంవత్సరాలదయినబరోలా పీపాలోంచి కొంత వైను తీసుకుని రుచికిచ్చాడు. లూయీ దాన్ని అందుకుని చూశాడు; వాసన చూశాడు; గ్లాసు యిటూ అటూ కదిలించాడు; మళ్లీ వాసన చూశాడు; తిరిగి పరీక్షగా చూసి తిరగేసి అన్నాడు:

"ఈ వైను అద్భుతంగా వుంటుంది–లోహపువాసన లేకపోతే."

ఇది విని గురువు పని ప్రారంభించాడు. తనూ వాసన చూశాడు. రుచిచూశాడు. మనసు మార్చుకుని పదేపదే వాసన చూశాడు.

"ఇంకేం అవసరం లేదు లూయీ; నీ తీర్పు రైటు. కాని పూర్తిగా నిర్ణయించందే నీకు ఘనత కాదు కదా. ఈ వైనులో లోహపు రుచి తగులుతుంది. దీనికి తోడుగా యింకోలోటు కూడా వుంది. మళ్ళీ ప్రయత్నిస్తావా?" అని అడిగాడు.

"చేయవచ్చా సార్?"

"చేసి చూడు."

ఇంకా జాగ్రత్తగా రెండోసారి పరీక్ష చేశాడు.

"నీ తీర్పు ఏరకంగానైనా మార్చుకుంటావా?"

"లేదు సార్, మార్చను; కాని నాకా లోహపు వాసన ఒక్కటే కనబడుతుంది."

"అయితే ఒక సంగతి చెప్తాను విను. లోహపు వాసనకి తోడుగా మామూలు తాడు వాసన కూడా వుంది. ఈ వైను తాగిచూడక్కరలేదు. నీ ముక్కు సరిగ్గా పని చేయడం లేదా? దాన్ని శుభ్రంగా ఎందు కుంచుకోకూడదు?" అంటూ ఆ పీపాని మళ్ళీ తీసుకెళ్ళి పెట్టేయమన్నాడు.

"దీని సంగతి కనుక్కుందాం. గురువూ, శిష్యుడూ కూడా పొరపడ్డారన్న అనుమానం కలగకూడదు."

పీపాలోంచి సారాయం అంతా తీయించేశాడు. చివరికి ఒక తాళంచెవి పడింది క్రింద. ఆ తాళానికి కట్టి రెండంగుళాల దారం కూడా వుంది!

పరీక్ష పూర్తి అయింది. గురువుగారు శిష్యునికేసి తిరిగి గౌరవపూర్వకంగా వంగాడు. తరువాత స్నేహ చిహ్నంగా చేయి అందించాడు. "నీ అద్భుత శక్తులకి కృతజ్ఞుణ్ణి. అమెరికాలో నీ తండ్రి దగ్గరకి వెళ్ళిపో. కాని ఒక్కటి మటుకు గుర్తుంచుకో—ఎప్పుడూ నీ నాసికను పరిశుభ్రంగా వుంచుకో."

లూయీ ఆల్బాను వదిలి కాలిఫోర్నియాకు వచ్చేసి ద్రాక్షవ్యాపారంలో కాలు పెట్టాడు.

మిస్టర్ మార్టినీకి వున్న మూడు తోటలలోకీ సెయింట్ హెలెనాలోనిది చాలా చిన్నది. నాపాలోనిది ప్రయోగాత్మకంగా వుంటే, మాంటీరోస్సోలోనిది పెద్దదీ-అన్ని హంగులూ వున్నదీ. ఒక ఉదయం మేం యిద్దరం బయలుదేరి మూడూ చూసివచ్చాం. సెయింట్ హెలెనా ఉదయాన్నే చూసి మాంటీరోస్సోకి బయలుదేరి వెళ్ళాలని ప్లానువేశాం. వచ్చేటప్పుడు నాపా తోట చూసి వచ్చేయవచ్చునని.

దారిలో ఆయన్ని అడిగాను: "మిస్టర్ మార్టినీ, మీ దృష్టిలో ఉత్తమోత్తమ మనదగిన వైనుని మీరు తయారుచేశారా?"

"సారాయం విషయంలో ఉత్తమం అన్న మాట చాలా పెద్దమాటే! ముందు నేచెప్పినట్టుగానే – క్షణక్షణం కాలిఫోర్నియను మద్యాలను బాగుచేస్తూనే వుండొచ్చు. దానికి ప్రయోగాలు చేయడానికి టైము కావాలి. ఈప్రయోగాలకి అర్థం యివ్వడానికి మనుషులు కావాలి. ఈలోగా ఈలోయలో వున్న అందరు తోటగాళ్ళూ మంచి పానీయాలను తయారుచేయాలని కృషిచేస్తూనే వున్నారు. అప్పుడప్పుడు మాలో కొందరం ప్రత్యేకంగా మంచి దన్నదాన్ని తయారుచేస్తూ వుంటాం. దానికి ఒక ప్రత్యేకమైన సీసా, ఒక ప్రత్యేకమైన ముద్రా అవసరం అని అనుకుంటూ వుంటాం.

"ఈ రోజున వీరు దాటుకుంటూ వచ్చిన యిబ్బందులు– మద్యనిషేధం మొదలైనవి – బట్టిచూస్తే కాలిఫోర్నియన్ మద్యగాళ్ళు చాలా ముందుకు వెళ్ళారనే అనుకోవచ్చు. యూరపులోని మంచివాటిలాంటి మంచి మద్యాలను కొన్నిటిని తయారు చేశారు; అయితే ఇవే ఉత్తమం అయినవి అనుకోనక్కర లేదు. అనకూడదు. వీరిలో ఏ ఒక్కరైనా యింకా ముందడుగువేసే ధోరణి కనబరుస్తున్నారంటే – అన్నిటికంటే అదే ముఖ్యం."

త్వరలోనే మాంటీరోస్సో చేరాం. భోజనాలయాక ఒక పక్క మొదలెట్టి తోట చివరిదాకా నడిచాం. ఈ తోట అంటే చాలా గర్వం మార్టినీకి. ఇదెంత వుత్తమమైన సారాయిలు పండించిందో, యింకా ఎంత

ఉత్తమమైనవి పండించగలదో తెలుసు ఆయనకి. గబగబా నడుస్తూంటే, నేనూ వెంటబడి నడిచాను. ఒక వరసనుంచి యింకోవరసకి దాటుకుంటూ నడుస్తున్నాడు. ఎక్కడైనా ఓ మొక్కకి ఎక్కువ జాగ్రత్త అవసరం అని తోస్తే పరీక్షిస్తున్నాడు; అస్తమానూ వాటిని గురించే మాట్లాడుతున్నాడు. ఇక్కణ్ణుంచి యిరవై మైళ్ల దూరంలో వున్న నాపాతోటకి వెళ్లాం.

"ఈ తోట నాకో ముఖ్యమైన ప్రయోగశాలగా చూసుకుంటాను. ప్రతి తోటలోనూ ప్రయోగాలు చేస్తూనే వుంటాంగాని యీ తోటకి ప్రత్యేకత యిస్తాను నేను. నాకో కొడుకు వున్నాడు. సుగుణవతి అయిన కోడలు వుంది. నలుగురు మనుమ లున్నారు. ఈ తోట పూర్తిగా ఉత్తమమైనదిగా తయారుచేసి, నా కొడుక్కీ, పిల్లలకీ యిచ్చేదాకా బ్రతికి వుండాలని నా కోరిక. నాకనుకుందుకు సమయం లేదు. కాని అతనికీ పిల్లలకీ – అయినా కనీసం ప్రారంభం చేసినవాణ్ణవుతాను."

"మీ కొడుక్కికూడా యీపనే యిష్టమా?"

"అదృష్టవశాత్తూ యిష్టమే. ఇష్టమే కాదు, నేర్పు కూడా వుంది. కాలిఫోర్నియన్ విశ్వవిద్యాలయంలో ద్రాక్షల పంటలనుగురించీ, వైన్ తయారీగురించీ చాలా నేర్చుకున్నాడు. అందుకై కావలసిన విజ్ఞానం వుంది. అంతకంటే ముఖ్యమయినది దీనిపట్ల అభిరుచి వుంది. పుస్తకాలలో నేర్పని యింకో సద్గుణంకూడా వుంది. వయస్సు

వుంది. మరేం ఫరవాలేదు. ఈ ద్రాక్షతోటలు మంచి చేతులలోకే వెడతాయి.''

1953 ఆగస్టులో నేనూ, నాభార్యా కాలిఫోర్నియాలో ద్రాక్షతోటలు చూడ్డానికని వచ్చాం. లివర్ మూర్ నుంచి శాంతక్లారాదాకా వచ్చి అక్కణ్నుంచి తీరంనుంచి నాపాలోయకు వచ్చాం. ఆగస్టు ఆఖరుశనివారంనాడు సెయింట్ హెలెనాలో వుంటామని ముందుగానే మార్టినీకి రాశాను. అక్కడ ఆయనను చూసి తిరిగి ఆరిగన్ లోకి వెళ్ళాలని.

మేం వుదయం పదిగంటలవేళ తోట చేరాం. అప్పటికాయన ఆఫీసులో వున్నాడు. బాగా బల్లమీదికి వంగి రెండుచేతులూ ముఖాని కడ్డుగా పెట్టుకుని పరీక్షగా చూస్తున్నాడు. ఏమైనా ఉత్తరాలేమో అనుకున్నాం. లోపలికి రాగానే కళ్ళద్దాలపైనుంచి చూస్తూ తలేనా ఎత్తలేదు. ఓక్షణంపాటు నాకేసే చూసినా నన్ను చూసినట్టే లేదు. తరువాత లేచి నాకేసి నడిచి వచ్చాడు. ''ఆ, పెల్లిగ్రినీ–సరిగ్గా టైముకే వచ్చారే!'' ఎంతో ఆదరాభిమానాలు ధ్వనించాయి ఆ ఆహ్వానంలో. ''భోజనంటైముకి ముందుగానే యిక్కడికి వస్తారని వూహించి ప్లానులన్నీ వేశాను. మీ కేం అభ్యంతరం వుండ దనుకుంటా. ఇవాళ మాంటిరోస్సోలో భోజనం. మీరూ, మీ భార్యా, నేనూ, యింకోయిద్దరూ. ఈ యిద్దర్నీ మీరు తప్పక కలుసుకోవాలి. నేను భోజనం తయారుచేస్తాను.

కోడికూర, ఆకుకూరలు, పళ్లు, వెన్న, మీ కే వైన్ కావలిస్తే అది. రేపు మాయింటికి భోజనానికి వస్తారని ఎదురుచూస్తూంది నాభార్య. సరేనా ?''

అభ్యంతరం దేనికి? మా కేం అంత ముఖ్యమైన పనులు లేవు. లూయీమార్టినీతో వంటయింటిలో భోజనం. అందరూ కోరుకోతగ్గది. ఎన్నో తయారుచేశాడు. అతని పనివాడు భోజనాలంతా పేక్ చేసి మాంట్ నోస్కోకి వెళ్ళి పోయాడు. పదకొండు అయేసరికి మేమూ బయలుదేరాం. మిగిలిన యిద్దరు అతిథులూ రెండుగంటలకి వస్తారు.

ఇది నిజంగా మరువరాని సంఘటన. తోటలో ద్రాక్షలు పరువుకివస్తున్నాయి. తోటకూడ కొండశిఖరాన వుంది. అక్కడ స్నేహితులందరం కలిసివున్నాం. వాతావరణం బాగుంది. ఎవరూ హడావిడిగా లేరు; విచారంగానూ లేరు. భోజనం పెద్దచెట్లనీడలో అమర్చబడింది. ఎంతో బాగుంది. కూరలు బాగున్నాయి. మద్యం అద్భుతంగా వుంది.

ఆదివారంనాడు మిసెస్ మార్టినీ, ఆమెకుమార్తే భోజనం తయారుచేశారు. స్త్రీల కిష్టమైన పద్ధతిలో, అందరికీ నచ్చేరీతిని వడ్డించారు. భోజనంతో మేం పుచ్చుకున్న మద్యం—''మార్టిని ట్రామినర్ ప్రైవేట్ రిజర్వు 1947''. మిగిలినవికూడ తాగేం. కాని మళ్ళీ మళ్ళీ ఈ మార్టినీ ట్రామినర్ కే వచ్చాం. 1934 జిన్ ఫాన్ డెల్ రుచిచూశాం. చాలా పాతపడిం దనుకున్నాం. 1942 కాబర్ నెట్ సావిగ్నన్

సీసా యిచ్చాం. ఇది చాలా తక్కువే వుండే అనుకున్నాం. నేను కాలిఫోర్నియాలో రుచిచూసిన అరడజను మంచి వానీయాలలోనూ యిదొకటిగా ఎప్పుడూ జ్ఞాపకం వుంటుంది నాకు. ఇంకా చాలా ఉత్తమమైనవి చూశాం రుచి. అవేం జ్ఞాపకం లేవు నాకు. నేను వాటి వివరాలను రాసిపెట్టుకోనూ లేదు.

తరువాత బాగా మధ్యాహ్నం అయాక నేనూ, మార్టినీ చేయీ చేయీ కలిపి నడుస్తూ యింటివెనక అడవిలా వున్న కొండనీడన పెరుగుతున్న కార్నెష్ ద్రాక్షలు చూడడానికి వెళ్ళాం. ఆరుగంటలు అయిపోతూంది. పురుగుల రొద దగ్గరవుతున్న చీకటులనుగురించి తెలియజెప్తూంది. అయినా యింకా సూర్యరశ్మి పూర్తిగా పోలేదు. చిరుగాలులకి ద్రాక్షఆకులు కదలాడుతున్నాయి. అంతా నిశ్శబ్దం ఆవరించుకునివుంది.

"ఈ రోజు, యీ దేశం, యీ తోట అన్నీ అందంగా వున్నాయి పిల్లిగ్రినీ; నాకు అరవైఆరు." ఓ క్షణం ఆగాడు ఏదో లెక్కవేయడానికన్నట్టు. "ద్రాక్షలు రంగు వస్తున్నాయి" అంటూ ఆకులక్రింద నున్న గుత్తులను పరీక్షించాడు. "ఆరేడువారాలలో దింపవచ్చు. మళ్ళీ నాకిరవై ఏళ్లు అయిపోతే బాగుండునని వుంది. ఇప్పుడున్న ఆరోగ్యం, ఉత్సాహం, శక్తితో ఆ వయస్సు కూడా వుంటే బాగుండును. పోనీలే, నాకో కొడుకు వున్నాడు. తక్కువ వ్యవధిలో చాలా ఎక్కువ నేర్చుకున్నాడు—లూయీ."

మెల్లిగా నడిచి చివరివరస మొక్కలదాకా వెళ్ళాం. అక్కణ్ణుంచి క్రిందికి చూశాం—వేలాడుతున్న తీగెలపైనుంచి.

ఇది కూడ సెయింట్ హెలెనా తోటలో ఒక భాగమే. మిగిలినది యింటిముందుగా వున్న లోయలో వుంది. ఈ కొండపై ఓ పక్క పరిశుభ్రం చేసి, చుట్టూ దడికట్టి, ద్రాక్ష నాటారు. ఎండ బాగా తగిలే ఏటవాలు ప్రదేశం; పై నుంచి నీరు వస్తూంటుంది. ఫ్రాన్సులోనూ, ఇటలీలోనూ అయితే యిలాంటి చిన్న తోట ధనికవర్గపు ఏ వ్యక్తులకి కూడా ఘనమైనదిగానే లెక్కింపబడుతుంది.

చివరివరసకి రాగానే దాని పొడుగంతా నడిచాం. అక్కడక్కడ ఆగుతూ గుత్తులు గుత్తులుగా వున్న ద్రాక్షలను చూస్తూ నడిచాం. ప్రతిగుత్తీ రంగొచ్చి ముచ్చటగా వుంది.

"ఈ కాబర్నెట్స్‌ని అక్టోబరు మధ్య దింపిస్తాను. అదేనా వాతావరణం మోసగించకుండా వుంటేను. మీ స్వంత నిల్వకి కొంత పంపుతాను. కొంత కాలం గడిచాక మా మాంటీరోస్సో బట్టీలలోని సరుకు కొంత పంపుతాను. రెండూ విడివిడిగా వుంచండి. అవి రుచిలోకూడా వేరుగానే వుంటాయి." అంటూ నవ్వుతూ "వైన్ మాస్టరుగా మిమ్మల్ని తయారుచేస్తే ఏమీ అనుకోరుకదూ-పిల్గ్రిమ్?" అని అడిగాడు. నా కేం అభ్యంతరం వుంటుంది?

ఆరోజు రాత్రి నాగదిలో పడుకుని లూయీమార్టినీని ఒక వ్యక్తిగా ఊహించుకోవడం ప్రారంభించాను. మా తొలి సమావేశం, అతనితో మాట్లాడ్డంలో, స్నేహం చేయడంలో నే నెదుర్కొన్న యిబ్బంది, ఫాయిర్-డి-యిటాలియాలో మా భోజనం, మెక్సికను మార్టినీ మంచిపనిచేయడంలో

చూపే సంతోషం, గర్వం, మా అన్ని సంభాషణలూ-అన్నీ జ్ఞాపకం చేసుకున్నాను.

మా అన్ని సమావేశాలలోనూ, కబుర్లలోనూ ఒక్కసారికూడ అతను 'డబ్బు'నిగురించి ప్రస్తావించడం విన్న జ్ఞాపకం రాలేదు నాకు. పునాదులనుంచి కష్టపడి పైకివచ్చిన యిటాలియనువలసవారందరికీ తమ డబ్బంటే గర్వంగా తోస్తుంది. దా న్నసలు మరిచిపోలేరు. కాని మార్టినీ బట్టీలలో వేలకొద్దీ సీసాల మద్యా లున్నాయి. ఫలవంతమైన ద్రాక్షతోట లున్నాయి; భూవసతి వుంది. ఇంటిదగ్గిర, యింట్లోనూకూడ 'ఉన్నదాని విలువ యింత' అన్న మాట అనగా వినలేదు నేను. తోటలలో వాటి నెలా అభివృద్ధిచేయా లనుకుంటున్నదీ చెప్పేవాడు; యింట్లో తన యింటినీ, చుట్టుపక్కలనీ ఎలా అభివృద్ధిపరచాలని యోచిస్తున్నాడో చెప్పేవాడు ... ఒక్కసారికూడ డబ్బునిగురించి ఒక్క మాటేనా అనలేదు.

చేయడంలోనూ, సృష్టించడంలోనూ కుతూహలం కల శీలవంతుడైన ఒక వ్యక్తి చిత్రం ... ఇల్లూ, తోటలూ అతను పనిచేసే ప్రయోగశాలలు. అక్కడ ఉత్తమోత్తమమైన పరిపూర్ణత కోసం సదా పాటుపడతాడు. 'నాచుట్టూ పరిపూర్ణత ఆవరించుకుని వుండాలని కోరిక' అన్నాడు. 'ఇది గొప్పకోసం కాదు; నాలోనుంచి వచ్చే ఆజ్ఞల కనుబద్ధంగా మాత్రమే' అంటాడు. ఇతని అంతరాంతర మిచ్చే ఆజ్ఞ లేమిటి? ఒత్తిడి ఏమిటి?—తన తోటలను వంక లేనివిగా చేయాలి. తన యింటిని, తన చుట్టూ ప్రపంచాన్ని పరిపూర్ణత్వంవైపు తీసుకుపోవాలి.

# 5

## దొంగసారా వ్యాపారి

# గ్యాడో సెల్లా

గ్యాడో సెల్లాకి యిట్టే స్నేహం చేసుకునే నేర్పు వుంది. ఎక్క డేనా గుంపుగా మనుషు లుంటే, మధ్యనుంటాడేగాని అంచు లంట వుండడు. మాట్లాడ్డం అంటే సరదా. బాగా మాట నేర్పరి కూడా. అందర్నీ నవ్వించడం ఎలాగో తెలుసు. మంచి ఆరోగ్యం, బలం కలవాడు; దానశీలుడు; డబ్బు మంచినీటిప్రాయంగా ఖర్చుపెట్టేవాడు. సూక్ష్మపరిశీలకు

లేవ రైనాసరే-అతడు మంచి వ్యాపారి, సరుకులమ్మేవాడని నిశ్చయించుకోవచ్చు.

కాని సామాన్యమైన కనీసపు విద్యకూడా లేదతనికి. ఇటలీలో చిన్నపిల్లవాడుగా వున్నప్పుడే మూడేళ్ళపాటు స్కూలుకు వెళ్ళాడు. సహజంగానే తెలివైనవాడు. ఆ తెలివి తేటలు తరవాత్తరవాత చూపించాడుకూడా. యాదాలాపంగా అదీ యిదీ చదివి పై మెరుగులు దిద్దుకున్నాడు. ప్రత్యేకించి కనబడతాడు-అతని యిటాలియను స్నేహితుల మధ్య. వారిలో చాలామందికి అక్షరజ్ఞానం లేదు; చాలా సాధారణమైనవాళ్లు. తన మాతృభాషకూడా చాలా చక్కగా మాట్లాడతాడు. నెమ్మదిగా చక్కగా మాట్లాడుతూ అప్పుడప్పుడు సంభాషణలో కవిత్వంకూడా దొర్లించేవాడు.

అధికారశిఖరాన వున్న రోజులలో-యిరవైలు దాటుతున్న రోజులలో గ్యూడోసెల్లా స్వరూపం అది.

అతని స్నేహితు లందరూ కూడా తుదివరకూ సెల్లా చాలా మంచివాడనే నొక్కి చెప్పేవారు. దానబుద్ధి కలవాడనీ, నమ్మకస్థుడనీ పేరు తెచ్చుకున్నాడు. అతని వ్యాపార పరిధిలో అది చట్టసమ్మతమైనదైనా కాకపోయినాకూడా చాలా నిజాయితీగా వుండేవాడు. బాగా డబ్బుసంపాదించినా కూడా గర్విష్ఠిగా మసలేవాడు కాదు. చెయ్యాలని చెడు చేశాడనికూడా ఆరోపించలేము.

కాని ఈ జీవితగ్రంథానికి అటువైపుగా చాలా చెడ్డ నిజాలు లేకపోలేదు. లాభదాయకం, చట్టసమ్మతం అయిన

వ్యాపారం వదలి యింకా లాభదాయకం, చట్టవిరుద్ధం అయిన వ్యాపారానికి వెళ్ళాడు. జైల్లో వున్నాడు. పెళ్ళాం పిల్లలు వదిలిపోయేలా చేశాడు. చివరికి అవమానకరమైన చివరి సంవత్సరాలుకూడా చూశాడు. ఇలాంటప్పుడు, సహజంగా యితడు మంచివాడని ఎలా చెప్పడం?

పరిస్థితులు కనుక యింకోవిధంగా వుండివుంటే, సెల్లా యింకోరకమైన వ్యాపారంలోనో, వృత్తిలోనో మర్యాదస్థుడుగా చెలామణీ అయివుండేవాడు అనడం సత్యానికి దగ్గర. తెలివి వుంది; ధైర్యం వుంది; ఆలోచనాపటిమ వుంది. ఇంకా నేర్చుకోవాలన్న కోర్కె కనబరిచాడు. నాగరికుల సమక్షంలో హాయిగా వుండేవాడు. విద్యపట్ల గౌరవం వుంది. కానైతే ఈ విజ్ఞానాభిమానం, తృష్ణా నిజమైనవో, లేక నాగరికుడుగా కన్పించాలని అలవరచుకున్నవో మటుకు ఎవరికీ తెలియదు. చెప్పలేం.

గ్యాడో సెల్లాకి ఆర్మండో గ్రిల్లీ అనే బాల్యస్నేహితుడు వున్నాడు. ఫ్లారెన్సుకి దగ్గరలోనే వున్న కేస్టెల్ నువో ప్రాంతంలో యిద్దరూ సమకాలికులు. ఇద్దరూకూడా పెద్ద కుటుంబాలలోంచి వచ్చినవారే. తల్లితండ్రులు తమది కాని భూమిని శ్రమించి దున్ని కష్టపడి కుటుంబాలకి జీవితావసరాలని సమకూర్చగలేవారు.

ఈ రెండు కుటుంబాలలోకీ సెల్లాకుటుంబమే మెరుగనిపించే పరిస్థితులలో వుంది. వ్యవసాయానికి తోడుగా ఆహారపదార్థాల కొట్టు నడిపేవారు. ఈ రెండవ వ్యాపారం

సెల్లాల ధైర్యానికి చిహ్నంగా చెప్పుకొనేవారు. ఇలాంటి ధైర్యమే గ్యాడోకికూడా వచ్చింది తండ్రిదగ్గరనుంచి. ఈ స్టోరువల్ల లాభం రాలేదు. ఆ వచ్చిన కొద్దిపాటే, గ్యాడోని మూడుసంవత్సరాలు స్కూల్లో వుంచగల్గింది. ఇంగ్లిష్ విషయం యింత బాగా లేదు. రెండవ సంవత్సరాంతంలోనే ఆర్మండోని స్కూలు మాన్పించారు. అయినా రెండు కుటుంబాలకీ పోలిక పోలేదు. ఇద్దరూకూడా యింతకంటే రాణించాలంటే కాస్టెల్ నువోస్, యిటలీనీ అధిగమించి అవకాశాలకోసం చూడాలి. 1906 లో గ్యాడో, ఆర్మం డోలు ఇరవైనాల్గు సంవత్సరాల యువకులుగా వున్నప్పుడు అమెరికాకేసి చూడ్డం ప్రారంభించారు. అదే సంవత్సరం జూలైలో న్యూయార్కు చేరారు. రెండువారాల తరవాత పశ్చిమపు రైలురోడ్లపై పనిచేయడం ప్రారంభించారు.

అప్పటికే కొట్టిన పిండిలాంటి పద్ధతినే వారూ అమలు లోకి తెచ్చారు. ఇద్దరూ ఆర్మీలో పనిచేశారు. తరవాత పెళ్లి చేసుకున్నారు. తరవాత ఇంట్లోవారంతా ఆలోచనలు చేసి యిటలీ వదిలేసే విషయం చర్చించారు. ఉత్తరఅమెరికాకా, దక్షిణఅమెరికాకా వెళ్ళడం? ఎంతకాలం అక్కడ వుండాలి? దారి కర్చులకి డబ్బెక్కడనుంచి తేవడం? శాశ్వతంగా కొత్తప్రపంచంలోనే వుండిపోవడమా? ఇటలీలో కొంత నేల కొనుక్కుందుకు సరిపడ్డంత సంపాదించుకుని తిరిగి వచ్చేయడమా? మరి భార్యల సంగతేమిటి?

చివరికి యునైటెడ్ రాష్ట్రాలకి వెళ్లాలని నిశ్చయించడం జరిగింది. కావాలనుకున్నంత సంపాదించాక భార్యల

కోసం తిరిగి రావచ్చు. వీరు వెళ్లడానికి కావలసినంత సొమ్ము పుట్టించడం అయింది. ఇద్దరి భార్యలూ గర్భవతులే. ఆ సమయంలో జెనోవానుండి ప్రారంభించి కొత్తప్రపంచానికి ప్రయాణం కట్టారు. ఇద్దరిలో ఎవరూ తిరిగి వెళ్ళలేదు. ఐదు సంవత్సరాలు గడవగానే భార్యాపిల్లల కోసం పంపించారు.

ఆకృతిలోనూ, తత్వంలోనూకూడా పోలికలే లేని గ్యూడో, ఆర్మండోలు ఇటలీలోలాగే యిక్కడ అమెరికాలో కూడా స్నేహితులుగానే వున్నారు. ఆర్మండో భారీమనిషి; గ్యూడో పొట్టివాడు. ఆర్మండో మాట్లాడితే ఆలోచించే శక్తి లేనివాడు మాట్లాడుతున్నట్టు అనిపిస్తుంది. ఆ చేతులు రెండేళ్ళ స్కూలుతరవాత పుస్తకం అన్నది ముట్టుకోలేదనిపిస్తుంది.

ఆర్మండో భోజనప్రియుడుకూడా. మంచి పనివాడుగా పేరు తెచ్చుకోవాలని అతని ఆశయం; మంచి కూరగాయల తోట పెంచాలని, కోళ్ళూ, చెవులపిల్లులూ పెంచాలని, ఎప్పుడూ తరగని మద్యం స్టాకు పెట్టుకోవాలని, యింట్లో అల్మారాలుకూడా ఎప్పుడూ నిండుగా వుంచుకోవాలనీ తల పోసేవాడు. చక్కని పరుపు కొనుక్కున్నాడు. మంచి భోజనాలు అతనికి యిష్టం. కుటుంబపు భవిష్యత్తుకోసం కొంచెం వెనకవేయాలన్నది ఆశయం కాదుగాని ఆచారం మాత్రమే. ఈ పరిధులలో అతగాడు మంచివాడే. బలమైన రైతు. చక్కని దిట్టమైన జోళ్ళు, చలినుంచి రక్షించే బట్టలు, నిండిన కడుపు, ఆటంకంలేకుండా పని దొరుకుతుం

దన్న నమ్మకం, తృప్తిచెందిన భార్య, ఆరోగ్యవంతులైన పిల్లలు – అన్నీ వున్నాయి.

గ్యాడో, ఆర్మండో యిద్దరూ పనికని న్యూయార్కులో తీసుకోబడ్డారు. అక్కణ్ణుంచి పశ్చిమంగా పనికని యింకొందరితో పంపబడ్డారు. ఆరెగన్‌లో కొలంబియానదికి దిగువన గట్టువెంట రైలురోడ్డు వేయడమే ఆ పని. ఓ సంవత్సరంపాటు అక్కడి రాళ్ళు పగులకొట్టుతూ కొండల్లో ప్రేలుడుపదార్థాలుంచి పగులకొట్టి రైలువెళ్ళడానికి దారి ఏర్పరుస్తూ గడిపారు. తరువాత యింకొక గుంపుతో ఉత్తర పసిఫిక్ రైల్‌రోడ్డుపనిలో పని దొరికింది వీరికి.

ఈ అధికమైన గుంపును గురించి కొంచెం తెలుసుకోవడం మన కథకి అవసరం. ఈ "గుంపులు" (గాంగులు) భాగులుచేసేపనివారు. ఒకనిర్ణీతభాగంలో పని ముగించడానికని విడివిడిగా నియమితం అయి, ఒక అధికారిఆజమాయిషీ క్రింద వుంటూవుంటారు. సెక్షన్ గుంపు అన్నది అసలుగుంపు–గాంగ్–కంటే చిన్నది. అయినా శాశ్వతంగా వుండేది. ఒక నిర్ణయించినంత రైలురోడ్డుకి వీరు బాధ్యులుగావుంటారు. ఈ పై గాంగువారు ఈ సెక్షన్ గాంగుకి సహాయం చేయడానికని వుంటూవుంటారు. ఈగుంపు క్షణంనోటీసులో ప్రయాణం అవుతూ రైలురోడ్డుమీద ఎక్కడ పని వుంటే అక్కడ పని చేస్తూవుంటారు. వీరు అత్యవసరపరిస్థితులలో త్వరితంగా ప్రయాణంచేయడానికని కావలసిన పనిముట్లతోపాటు లారీలవంటివాటిలోనే వుంటూవుంటారు. నిజాని కా కార్లే వారి యిళ్ళన్నమాట.

అప్పట్లో చేత్తో, పనిముట్లతో చేసే ఈపని కష్టమై నదే. ఈరోజుల్లో మిషను లున్నాయి. అన్నిరకాల వాతా వరణంలోనూ, పొలాలలో, వంచిన నడుము ఎత్తకుండా కష్టపడి పనిచేసే శక్తివంతులు యిక్కడ ఎంతైనా అవసరం. ఆలోచించే తత్వం వుండడం, పగటికలలు కనడం – చేతు లతో పనిచేయవలసిన వాడికి ప్రతిబంధకాలే.

రైలురోడ్లపై పనిచేయడం అంత సరదా అయినది కాదు; మంచిగాలి, పల్లెటివాతావరణం, కొండలూ, మైదానాలూ, అడవులూ...నిశ్శబ్దంగా వుండే వాతావరణం– యివన్నీ ఆకర్షణలే. కాని వీటితోపాటే ఎండవేడి, చలి గాలి, తుఫానులు, వానలు అవీ పుచ్చుకోగల్గాలి.

ఈపని యిందుకనే అమెరికాలోని అతిబీదతరగతుల వారికే పరిమితం అయివుంది. కాని యిటలీనుంచి వలస వచ్చిన వారు అన్ని పనులకంటే ఈపనిలోనే ఎక్కువ ఆసక్తి కనబరచేవారు. ఎంత త్వరగా వీలైతే అంతత్వరగా ధనం సంపాదించగల్గడమే ధ్యేయం. అప్పుడే మామూలుగా క్రమబద్ధమైన జీవితం ప్రారంభించడానికి అవకాశం చిక్కు తుంది. అందుకని ఆటంకం లేని పని కావాలని కోరుకునే వారు. ఆపని ఈ రైలురోడ్లు సరఫరా చేస్తాయి.

గ్యూడో, గ్రిల్లీలవంటి ఇటాలియనులకి ఈ ఎక్ట్రాగాంగు యింకా అవకాశాలని కల్పించేది. వసతికి, భోజనానికి అయే ఖర్చు చాలా తక్కువగా వుండేది. కంపెనీవారే వుండడానికి యిల్లూ, వంటచెఱకూ సరఫరాచేసేవారు. గాంగుకి వంట

వాడు వుంటాడు. సరుకులన్నీ కూడా గుత్తబేరంమీద కొనడం జరిగేది. తమకి తోచినట్టు ఆర్డరిచ్చి వండించుకు తినేవాళ్లు. వంటవాడుకూడ తమకు కావలసినట్టు వండి పెట్టేవాడు. లేకుంటే ఏమవుతుందో వాడికి తెలుసు. నెలాఖరున ఈ ఖర్చు అంతా అందరూ పంచుకునేవారు. గాంగు బాగా జాగ్రత్తగా పనిపాటులు ముగించుకుంటే బాగా బ్రతక డానికీ, నిల్వచేసుకుందుకూకూడా అవకాశం చిక్కేది.

ఇంకా నేర్పరులూ, ఆశావాదులూ అయితే, యింకా ముందుకి పోయే అవకాశాలుకూడా లేకపోలేదు. చదువనూ రాయనూ రావాలన్న ఏ యితర వుద్యోగంలోనైనా అయితే స్థానిక అమెరికనులతో ఈ అక్షరజ్ఞానం లేని యిటాలియనులు పోటీపడి గెలవడం దుర్లభమే. ఈ రైలు రోడ్డుపనిలో నిజాని కంతా తనదే నన్నంత ధైర్యంగా వుండవచ్చు. ఈ పనిలో నిపుణత సంపాదించాక - ఏ అధి కారికో సహాయదారుగా వుండే ఉద్యోగంకోసం ఎదురు చూడవచ్చు. అక్కడనుంచి అదృష్టం కలిసివస్తే, తక్కువ తరహా ఉద్యోగికూడా అయ్యే అవకాశాలు లేకపోలేదు.

ఈ ఎక్ట్రాగాంగు ప్రపంచంలో పనిచేస్తూ గ్యూడో, గ్రిల్లీకూడా తమ నేర్పు విస్తరింపజేసుకునే దారులు కని పెట్టారు. గాంగు నిజానికి అందరికీ వెళ్ళడానికి అవకాశం వున్న స్థలం. ఇక్కడే గ్యూడో అందరితోటీ కలిసిమెలసి వుండడం, మాటనేర్పరితనం అన్నీ అలవరచుకొని అమలు లోకి పెట్టగల్గాడు. ఇక్కడే తన భవిష్యత్తునిగురించి

ప్లానులు తయారుచేసుకున్నాడు. గ్రీల్లీ యిక్కడ మంచి పనివాడని పేరు తెచ్చుకున్నాడు.

దైనందిన పనిపాటులలో పోటీ అన్నదికూడా ఒక భాగం అయిపోయింది. సెల్లా, గ్రీల్లీ వచ్చేదాకా ఏ గుంపూ ప్రథమద్వితీయస్థానాలంటూ అలంకరించలేదు. పీరి రాకతర్వాత రెండవ స్థానానికే గౌరవం దక్కింది. ఎందుకంటే ఎక్కువగా ఎవరినీ గ్యాంగ్ ఆకర్షించకపోయినా, గ్రీల్లీతో ఎవరూ పోటీపడి నిలువలేకపోయేవారు. గ్రీల్లీకి, తనకు నచ్చిన వాతావరణంలో తను కోరుకున్న పని లభించడంతో చాలా సంతోషంగా వున్నాడు. తనలాంటి వారి మధ్యనే వున్నాడు. రాజాభోజనం లభ్యం అవుతూంది. రెండు సంవత్సరాలలోపలే తన సంసారంకోసం కబురు పంపగల నన్న ధైర్యం చిక్కింది.

ఈ కొత్తగా వచ్చిన సంతోషం అతిఉత్సాహాన్నిచ్చిం దతనికి. చేతిలో పనిముట్లు అంత తేలికని ఎప్పుడూ అనిపించలేదు; హాయిగా తిరిగి ఎండా చలీ ఒకలాగే అనుభవించేవాడు. అందంగా తయారైన రోడ్డు చూసి తృప్తిపడేవాడు. ఈ పరిపూర్ణతకి లోటు ఒక్క భార్య దగ్గరలేకపోవడమే. కాని ఆమెకూడా త్వరలోనే వస్తుందని తెలుసు.

ఈలోగా సెల్లా తన కిదివరకు తెలియని విషయాలను గురించి ఆలోచిస్తూ సులభమార్గం పట్టుకు ప్రయాణం సాగించాడు. కథలు చెప్పేవాడు; వాదనలు సరిదిద్దేవాడు; ఆలోచనలు, సలహాలు చెప్పేవాడు; అక్షరాలు రానివారికి

ఉత్తరాలు రాసిపెట్టేవాడు. తన భవిష్యత్తుగురించి ఆలోచించుకునేవాడు. ఈ గాంగు తనకి రంగస్థలం; ప్రేక్షకులూ కూడాను. తనో చాలా చక్కని కథలు చెప్పగలడు.

సెల్లానుకూడా అందరూ అభిమానించేవారు. అతని సరదాప్రకృతి, భేషజం లేని ప్రవర్తన, ఏవిషయంలోనైనా సరే అవసరం అయినవారికి ఆదుకునే సహృదయత అతనికి స్నేహితులని తెచ్చిపెట్టేవి. ఉత్తరాలు రాసేవాడుగా యితను బాగా చలామణీ అయేవాడు. ముఖ్యంగా తమ ఆడవారికి ఉత్తరాలు రాయించుకునేవారు. ముద్దుపెట్టుకుంటే ఎంత సన్నిహితమో అంత సన్నిహితంగా అనిపించే సుదీర్ఘాలైన ప్రేమలేఖలు రాయగలడని పేరు తెచ్చుకున్నాడు సెల్లా.

ఫిబ్రవరి మాసంలో ఒక వుదయాన గ్యాడో గ్రిల్లీతో చెప్పాడు–గాంగును వదలిపెట్టి పోతున్నానని.

"నీ కోసంగతి చెప్పాలి ఆర్మండో. వంటవాడితో మాట్లాడుతున్నాను ఈమధ్య. మూడువేలా ఆరువందల పౌనుల మాంసం తింటున్నామట మనం ఒకనెలకి."

"అబ్బే! అంతుండదు. దరిదాపు రెండుటన్నులా?" అన్నాడు గ్రిల్లీ.

"నే నంకెలూ అవీ చూశాను. దీనికి తోడుగా ప్రతినెలా ఎనిమిదిగేలన్ల ఆలివునూనె, నాలుగువందల గాలన్ల సారాయి, రెండువందల పౌనుల వెన్న, యింకా ఎన్నో యితర ఆహారపదార్థాలూ వాడుతున్నాం. నెలకి రెండు

సార్లు సన్ ఫుడ్ కంపెనీనుంచి మాఫీ వస్తాడు - వంటవాడి దగ్గిరనుంచి ఆర్డరు తీసుకుందుకు. వీడే యితరగాంగులదగ్గిరకీ, కుటుంబాలదగ్గిరకీ కూడా వెళ్ళి ఆర్డర్లు తెస్తాడు. ఎప్పుడేనా ఆలోచించిచూశావా - ఈపని నువ్వూ నేనూ ఎవరైనా చేసివుండవచ్చు. నేను ఈపని చేయాలని నిర్ణయించాను. మార్చినుంచి రోమాఫుడ్ కంపెనీమనిషిగా పనిచేస్తాను.''

ఈపని చేయడం ప్రారంభించిన నెల్లాళ్ళకి సెల్లాకి తను చేసిన పని సరైనదని నమ్మకం కల్గింది. తొలి సంవత్సరం గడిచేసరికి అతని లాభాలు అతని పూర్వపు మూడు సంవత్సరాల పూర్తి సంపాదనకంటె ఎక్కువగా కన్పించాయి. ఆనాటితో గ్యూడో సెల్లా అమెరికాలో కాలూని, దాన్ని కనిపెట్టినట్టే భావించాడు.

పశ్చిమంలో వున్న ఓ పెద్ద పట్టణంలో రెండు పోటీ కంపెనీలు-రోమా, సన్ కంపెనీలు. ఈ కంపెనీలకి వ్యాపార దక్షతా లేదు; నికరమైన ధరలూ లేవు. ప్రతిరోజూ యజమాని యింటికి కావలసిన వన్నీ పట్టుకెళ్ళేవాడు. వాటికి లెక్కరాసేవాడు కాదు. నెలాఖరున డబ్బుకట్టి ఎక్కువదంతా లెక్కరాస్తూండేవారు. అదే వారి పద్దురాయడం పద్ధతి. వ్యాపారసంస్థలుగా ఇవి మంచివి కావు. డబ్బు చేసుకోవడమే వ్యాపారం అన్న దృష్టి వారిది.

రోమా, సన్ కంపెనీలు ఎప్పుడూ పోటీపడుతూ, యిటాలియనువారికోసం తాపత్రయపడుతూండేవారు. అప్పటికి అమెరికను లింకా యిటాలియనులభోజనాలకి అలవాట్లు

పడలేదు. అందుకే అది చాలా లాభసాటి అయిన రంగంగా తోచేది. అప్పుడు తెలియకపోయినా, ఈ రంగం పదేళ్ళలో చాలా విస్తరించింది. ఈకంపెనీల మనుషులు తిన్నగా విని యోగదారుకే అమ్ముతూవుండేవారు. నెలకి రెండుసార్లు వెళ్ళి ఆర్డర్లు పట్టుకొచ్చేవారు. రోజురోజుకీ న్యూయార్కులో దిగేవారి సంఖ్య పెరగడంతో, వెన్న నూనె మొదలైన వాటికి కూడా గిరాకీ పెరిగింది.

తమ జీవితాలలో తొలిసారిగా వలసవచ్చినవారు మాంసం, వెన్న, తెల్లని రొట్టె తినగలిగారు. శ్రమించి పనిచేసి, బకాయిలు లేకుండా డబ్బు యిచ్చేస్తుండేవారు. సుష్టు పూర్తిగా భోజనం, సుఖనిద్ర వారికి ఈనాడు తీరిన కోరికలు. తమ జీవిత పరమావధికి కర్చుచేయడానికి అవే హద్దులు. మిగిలిన విషయాలలో ఆదా చేస్తూవుండవచ్చు. తమ యిళ్ళు మోటగా, సామానులే లేకుండా వుండవచ్చు. కాని వారి పక్కలూ, భోజనాలూ మటుకు ఘనమైనవే.

ఈ కంపెనీల మనిషి రావడం స్నేహపూర్వకంగానూ, పనిగానూ కూడ వుంటూవుండేది. సాంఘికంగా పేరు సంపాదించుకున్న వ్యాపారి ఎప్పుడూ దెబ్బ తినడు. నెలకి రెండుసార్లు – జీతా లందుకునే రోజున కొత్త ఆర్డర్లు తేడానికీ, పాతవాటికి డబ్బు వసూలుచేయడానికీ వెడుతూ వుండేవాడు. పరిశుభ్రంగా వుండి, చాలా మర్యాదగా వచ్చే యితడు సరాసరి యిళ్ళకి వెళ్లేవాడు. ఇతడే వీరికీ పట్నానికీ మధ్య వంతెన. వార్తలకి విశేషాలకి, కూలీవిషయంలో

ఏమైనా మార్పు లొస్తాయేమో అన్న వార్తలకి - అన్నిటికీ అతడు ఆధారం. ఒక డాలరుకి ఇటాలియనుడబ్బు ఎంత వస్తుంది? పాతదేశంలో కుటుంబానికి ఈ ఏభయి డాలర్లు పంపడాని కింకా కొంతకాలం వేచివుండడం మంచి దంటావా? జబ్బుగా వున్న ఒకరి కెవరి కేనా డాక్టరుని సూచించగలవా? సలహా కావాలన్న వారికి లాయర్నెవరేనా? చక్కగా యిల్లు సరిదిద్దగల్గిన వితంతు వుంటే చెప్పు మన మైక్ కి... ఇలాంటి విధులన్నీ నిర్వర్తిస్తూ...తగినరీతి ఆలోచనల నివ్వడానికి సెల్లాను మించిన వ్యక్తి దొరకడం కష్టం. అందరినీ పలకరించడం అయాక, అందరికీ సంతోషం కల్గేలాగ చిన్న చిన్న బహుమతులు పంచేవాడు - మగవాళ్ళకి పొగాకు, పిల్లలకి తినుబండారాలు, స్త్రీలకి తగ్గవి కొన్ని.

రాజకీయాలంటే యిష్టమున్న వారికి ఇటాలియన్ వార్తాపత్రికలలోని తాజావార్తలన్నీ చెప్పేవాడు. జీతాల రోజున పట్నం తిరిగివస్తే సెల్లా జేబులు నిండుగా వుండేవి. తమవారికి పంపమని అందరూ డబ్బు నమ్మకంగా యిచ్చేవారు. వారికి చేసే సేవలో యిదీ ఒక భాగమే. అంత నమ్మకస్థుడయిపోయాడు వారందరికీ. వారికి కావలసినవన్నీ టౌనులో కొనిపెట్టేవాడు. ఆడవారికి కావలసిన బట్టలు కొనేవాడు కుట్టుకుందుకి. పని చేసేటప్పుడు వేసుకుందుకు మంచి బట్ట ఎక్కడ దొరుకుతుందో అక్కడ మగవారికి తెచ్చిపెట్టేవాడు.

సాధారణంగా యిలాంటి వ్యాపారి ఒకసారి ఒకరితో, యింకొక సారి యింకొక కొనుబడిదారుతో భోజనం

చేయడం రివాజు. దానికి ఖరీదు యిచ్చేస్తూండేవారు. ఇది అందరికీ సులువైన పద్ధతి. జీతాలు వచ్చిన రోజున భోజనం అద్భుతంగా వుంటుంది. మంచి పులుసు; మాంసమూ, కోడికూర; చాలా కూరగాయలు, మంచి సారాయి, రొట్టె, పళ్ళు, వెన్న, కాఫీ - అన్నీ విందుభోజనంగా వుండేది. వ్యాపారి కిది బాగుంటుంది. యితనిచ్చే ఆ కొంచెం డబ్బూ, ఎందుకైనా ఉపయోగిస్తుంది యింటి యజమానికి.

ఎప్పుడేనా కొంచెం నేర్పరికాని వ్యాపారి ఈ భోజనం వుట్టినే రాదా అని చూస్తాడు. లేకుంటే ఖరీదును గురించి పేచీపెట్టుకుంటాడు. సన్ కంపెనీకి పనిచేసే మాఫీ యిలాగ తరుచు భోజనం ఖరీదు విషయంలో పేచీపెట్టుకునేవాడు. సెల్లా ఎప్పుడూ రెట్టింపు యిచ్చేవాడు. అదీ - వంటవండిన ఆమెకీ, ఆయింటి యజమానికీ ఎంతో కృతజ్ఞతలు తెలుపుతూను. "మీ యింట్లో భోజనం చేయడమే గర్వింపతగ్గ విషయం. నిజంగా ఈ భోజనానికి ఖరీదు కడితే నే యిచ్చుకోలేను. నాకృతజ్ఞత తీసుకుని మళ్ళీ వచ్చే అవకాశం కల్గించండి" అనేవాడు.

సెల్లాను పెట్టుకుని రోమా కంపెనీ బాగా లాభాలు తీయసాగింది. సన్ కంపెనీ దివాలా స్థితికి వచ్చేసింది.

1913 లో గ్యూడోసెల్లా సన్ కంపెనీ కొనేసి లాలూనా అని పేరు మార్చాడు. తనే యజమాని అయాడు. తక్షణమే అతన్ని విజయంకూడా ఆవరించింది.

1916 వచ్చేసరికి సెల్లాకు నల్గురు పిల్లలు; ఇద్దరు ఆడ పిల్లలు; యిద్దరు మగపిల్లలు. అమెరికాకు వచ్చి పదేళ్ళు అయింది. అతని భార్య గెల్సుమినా తొలిసంతానము రోమా కంపెనీలో చేరిన తొలిసంవత్సరం వచ్చారు. 1916 లో తనకు నాల్గవ సంతానం కలగగానే యిటలీలోని తన తల్లి తండ్రులకు ఉత్తరం రాశాడు. ఇటలీకి వచ్చి తన కుటుంబంతో కలిసివుండమని. ఆ ఉత్తరంలో కొంచెం భాగం యిలా నడిచింది:

"నాపని కిక్కడ బాగానే వుంది. యిలాగే కొంత కాలం జరిగితే కొద్ది సంవత్సరాలలోనే ధనవంతులం కావచ్చు. మాంసం ముక్కలుగా అమ్మడం నాకు బాగా జ్ఞాపకంవుంది–రోజుకొక పౌనో, రెండో. క్రిందటినెల నాలుగు టన్నుల మాంసం అమ్మానంటే నమ్మగలవా? అక్కడ వుండి అమెరికాను వూహించుకోవడం మీతరం కాదు. మీరు వచ్చి చూడాలి. సామాన్యులైన యిటాలియనులు–అక్కడ కష్టపడి పనిచేసేవాళ్లు–ఇటలీలోని ఉన్నత చర్చి అధికారులకన్న గొప్పభోజనాలు చేస్తారు. 1913 లో నే కొన్న వ్యాపారం ఈరోజున ఏభై వేల డాలర్ల విలువ చేస్తుంది. ఈలాగే సాగితే యింకో అయిదేళ్లలో దీనికి రెట్టింపు కాకతప్పదు." దీనికి సమాధానంగా అతని తల్లి దండ్రులు యిలా రాశారు:

"నాలుగు టన్నుల మాంసంగాని, ఏభై వేల డాలర్లను గాని వూహించుకోవడం మా తరంకాదు నాయనా. మా

ర్థం అయిదంతా-కష్టపడి పనిచేయడం, దారిద్ర్యం, బాధలు భరించడంవంటివే. మాకు సంతోషం, ఆనందం, ఐశ్వర్యం అర్థంకావు. నీకు జ్ఞాపకం వుందా? మీ తాత ఒక కథ చెప్తూండేవాడు: గుండె ఆగి ఎలాగ ఒక రైతు చచ్చిపోయాడో. అదీ ఎందుకు-జూదంలో ఐదువేల లైర్‌లు బహుమతిగా వచ్చిందని తెలిసి! లేదు. లేదు. మా కా ఐశ్వర్యం నిలదొక్కుకునే ఆత్మస్థైర్యం లేదు. మీ తల్లీ, నేనూ కలిసి నీ ఆహ్వానాన్ని గురించి చర్చించాము. కాని అది కుదరదు. ఇలా రాయడానికి చాలా బాధగా వుంది. ఎందుకంటే నీదగ్గిర వుండాలన్న కోరిక చంపుకోవలసి వస్తూంది. మా వయస్సులో బాగా వున్న నేలలో వేరులు తన్నుకునివుంటాం. వాటిని పెళ్లగించడం ప్రమాదమే కదా! మిగిలిన కుటుంబంసంగతికూడా ఆలోచించాలికదా? నీఅక్కలూ, చెల్లెళ్లూ, అన్నదమ్ములూ అంతా యిక్కడే వున్నారు. మీఅమ్మా, నేనూ నిన్నుకోరేది ఒకటే-యుద్ధం అయిపోగానే నీ వ్యాపారం అమ్మేసి యిక్కడికి వచ్చేయి. నువ్వు చేసిన సహాయంతో యిక్కడ బాగానేవున్నాం. ఏభై వేల డాలర్లంటే ఎంతో తెలియదుగాని, మన పల్లెనంతా కొనేయవచ్చునని వూహిస్తున్నాను. ఇల్లు కట్టుకోవచ్చు. నేల కొనవచ్చు. నువ్వూ, నీ కుటుంబం హాయిగా కాలక్షేపం చేయవచ్చు. దయచేసి తప్పక తిరిగివస్తానని చెప్పు..."

ఆరునెలలు గడిచాక గ్యూడో సమాధానం రాశాడు:

"అమ్మకీ, నాన్నకీ,

ఇంతకాలం వుత్తరం రాయనందుకు క్షమించాలి మీరు. ఇంతకంటె త్వరగా రాయలేకపోయానంటే నమ్మాలి మీరు. అమెరికా యుద్ధంలోకి దిగడంతో దేశం మొత్తంమీద వ్యాపారం విస్తరిస్తూంది. జీతాలు పెరిగాయి. పనిచేసే టైముకూడా ఎనిమిదిగంటలకి తగ్గించేశారు. ఎంత పని వుందంటే, ఆడవారినికూడా వ్యాపారంలో పనికి పెట్టుకుంటున్నారు. ఇందులో పూర్వం అయితే మగవాళ్ళనే తీసుకునేవారు. గతనవంబరులో రాసిన దానికంటే నా వ్యాపారంకూడా ద్విగుణించింది. ఎంతో చేయవలసినది వుంది. సగంరాత్రిదాకా పనిచేస్తూనేవున్నాను. అందుకే త్వరలో ఉత్తరంరాయలేక పోయాను. మీరు సూచించిన దాన్ని గురించి ఆలోచించడానికికూడా నాకు వ్యవధి కావాలి. నేనూ, గెల్సొమీనా దీన్నిగురించి చాలా దూరం ఆలోచించాం. మీరు చెప్పినదే బాగుం దనుకున్నాం. యుద్ధానంతరం, వీలైనంత త్వరలో వ్యాపారం అమ్మేసి అక్కడికి వచ్చేస్తాం, ఏమంత పరిస్థితులు విషమించకుండా వుంటే. నా వ్యాపారం యిప్పుడు (1920 నాటికి) నూట యాభై వేల డాలర్లు వుంటుంది. ప్రతినెలా నేను పంపించే దానితో ఏ నేల మంచిదని తోస్తే దాన్ని మీరు కొనండి. మనిద్దరిపేరునా వుంచండి. నేను వచ్చేసేలోగా, నా కుటుంబానికి తగిన ఒక యిల్లేనా అమరుతుందని తలుస్తాను."

దానికి అతని తండ్రి యిలా సమాధానం రాశాడు.

"ప్రియమైన కుమారునికి,

1910 లో గెల్సుమినా, పాపాయీ నిన్ను కలుసుకుందుకు వచ్చినప్పుడు అమెరికా నిన్ను శాశ్వతంగా అట్టే వుంచుకుంటుందనీ, మళ్ళీ నిన్ను చూడలేమేమో అనీ భయపడ్డాం. అందుకే నీ ఆఖరువుత్తరం ఎంత సంతోషం కల్గించిందో వూహించుకో. ఈ రోజునుంచి నీ రాకకోసం ఎదురు చూస్తున్నాం. నీ రాకను ఈ చిన్నపల్లె మరిచిపోలేనంత ఘనంగా ఆహ్వానిస్తాం. జాగ్రత్తగా చూసుకో. మరీ కష్టపడి పని చెయ్యకు. మమ్మల్ని మాత్రం నిరాశపరచకు. ఆస్తి విషయం చూస్తూనేవున్నాను. నీకు కావలసినది చూశాను. ఎక్కువ నేలతో సియన్నాదగ్గిర ఒక యిల్లు బేరం చేస్తాను. టస్కనీలో కంతా మంచినూనె యిచ్చే ఆలివ్ చెట్లున్నాయి అక్కడ. ద్రాక్షతోటకూడ పెద్దదే - సంవత్సరానికి మూడువేల గాలన్ల సారాయం వస్తుంది."

సెల్లా యీ వుత్తరానికి సమాధానం రాయలేదు. 1917 క్రిస్మస్ కి తలిదండ్రులకి బహుమతులు పంపాడు. 1918 వసంతంలో ఈక్రింది లేఖ రాశాడు:

"ప్రియమైన తండ్రిగారూ,

నానుండి చాలకాలంగా వుత్తరం లేదని ఆదుర్దా పడుతూవుంటారు. మేం అంతా హాయిగా, కులాసాగా వున్నాం. నాపని చాలా బాగానే జరుగుతూంది. నేననుకున్నంత యిదిగా కాదనుకోండి. ఇదివరలోకంటే పోటీ

బాగా పెరిగింది. చాలామంది యిటాలియనులు తెలివిమీరు తున్నారు. ప్రతిరోజూ ఎవడో ఒకడు కొత్తషాపు తెరుస్తున్నాడు. ఈ రాష్ట్రానికంతా రెండే కొట్లు వుండేవి పది సంవత్సరాల క్రిందట. ఈరోజున ప్రతి షాపులోనూ ఇటాలియనుస్టో రొకటి వెలిసింది. అయితే యిది నేరం చెప్పడంగా భావించకండి. నాకు రావలసినదానికంటె ఎక్కువగానే వ్యాపారం వస్తూందని తలపోస్తున్నాను. మీరు నమ్మశక్యంకాని దొక టిప్పుడు చెప్పాలి. గత డిసెంబరులో, ఈదేశంలో నిషాపానీయాలని నిషిద్ధం చేస్తూ చట్టం చేయబడింది. దాన్నే మద్యనిషేధం అంటారు. ఇక రెండు మూడు సంవత్సరాలలో ఓ గ్లాసుమద్యం పుచ్చుకోవడంకూడా నేరంగా తయారయేలా వుంది. ఇంతకంటే బుర్ర లేని చట్టం ఎక్కడైనా చూశారా? గ్లాసులో వైన్ పోసుకుంటారు. నోటిదగ్గిరకి తెస్తారు. అంతే-నువ్వో నేరగాడివి! అయితేనేంగాక, ఎవరూ తాగుడు వదిలేద్దాం అని నిర్ణయించుకోవడం లేదు. అమెరికనులూ, ఇటాలియనులూ కూడ మాట్లాడుకొనేది ఒకటే అయిపోయింది: 'ఎన్ని సీసాలు దాచావు?' నిషేధం వుండనీ, లేకపోనీ - అమెరికనులు త్రాగుడు వదలరు. నా వ్యాపారంలో స్నేహితులతో ఈ విషయం చర్చించాను. అందరం అనుకున్నాం—ఈ నిషేధంవల్ల కొంత డబ్బు సులభంగా సంపాదించే అవకాశం ఏర్పడుతుందని. ఈచట్టం అమలులోకి రాగానే, ఒక సీసాడు విస్కీ ఖరీదు రెండుమూడు రెట్లు పెరగవచ్చు. అందుకే నా నిల్వ సొమ్ము నంతా ఈ లిక్కర్ కొని నిల్వచేయడానికి వినియో

గించాను. ఇప్పుడు యిరవై వేలు పెడితే కొద్దిసంవత్సరాలలో ముప్ఫయి నలభై వేలదాకా లాభం రావచ్చు. ఇది ప్రమాదమే అనుకో. కాని, తెలివితేట లుంటే ఎక్కడ ఆగాలో తెలిసి ప్రవర్తిస్తే-ఫరవాలేదు...''

అన్ని రకాల చట్టవిరుద్ధమైన వాటిలోకంటే ఇటాలియను వలసదారు లీలాగ దొంగసారాయి వ్యాపారం పక్కకే ఆకర్షితు లయారు. ఈపని అంత మానసికవ్యథ కల్గించలేదు. మద్యనిషేధానికి నైతిక విలువ లేదని నమ్మకం. నిషాపానీయాలు వాడడం అన్నది అతని జీవిత పద్ధతి - మతం ఒప్పుకున్నదే. బేరంవల్లా, మార్పిడివల్లా రొట్టెకోసం పానీయాలు యిచ్చాడు. తరతరాలుగా మంచి రకం మద్యాలను పక్కనుంచి...మతవిందులకు ఉపయోగిస్తూ వుండేవాడు.

గ్యాడో సెల్లా ఈ వ్యాపారం, తప్పుచేస్తున్నా నన్న బాధ లేకుండా, ప్రారంభించాడు. ఈ దొంగ వ్యాపారిగా దిగేవాడు కాదు-ఈ వ్యాపారం వల్ల నైతికపతనం కల్గుతుందని నమ్మివుంటే.

చాలా లాభసాటి అయినది ఈ వ్యాపారం. దీని ద్వారా అతను దాచిపెట్టిన డబ్బు దానికి వస్తుందని వూహించిన దానికి రెట్టింపు. డెబ్భయిఅయిదువేల డాలర్లు జేబులో వుంచుకుని వ్యాపారం అమ్మేద్దాం అని అనుకుంటున్నా నని తండ్రికి రాశాడు సెల్లా. ఆ ఉత్తరం తండ్రికి అందికూడా వుండదు; అప్పటికే మనసు మార్చుకుని-యింకో

రెండేళ్ళపాటు అమెరికాలోనే వుండాలని నిశ్చయించుకున్నాడు. త్వరగా డబ్బు సంపాదించడానికి కింకో మార్గం గోచరించింది అతనికి. ఆ అవకాశం పోగొట్టుకోదలచలేదు.

ఎండుద్రాక్షలతో వ్యాపారం ప్రారంభించాడు. కొట్లో పూర్వంలాగా ఎప్పుడైతే మద్యం కొనుక్కోవడం సాగలేదో అప్పణ్ణుంచీ అమెరికాలో ఉన్న నాలుగైదు మిలియన్ల యిటాలియనులు ఈ ఎండుద్రాక్షలతో మంచిసారాయం తయారుచేసుకోవడం ప్రారంభించారు. దీనికికూడా బాగా నిషాయిచ్చే తత్వం వుండడంవల్ల దీనికి అక్కర పెరిగింది. ఎప్పుడూ అంతగా మద్యం పుచ్చుకోని అమెరికనులలో కూడా దీని వాడుక ప్రారంభం అయింది.

దీనితో మార్కెట్లో వున్నదానికంటే అడిగేవారి సంఖ్య ఎక్కువ అయింది. గ్యూడో తన పోటీదారులకంటె ఎక్కువ ఖరీదు యిచ్చి కొనడానికి జంకేవాడు కాదు. తన కొట్టంతా వీటితో నింపేశాడు. తరువాత ఖరీదు పెంచి అమ్మడం ప్రారంభించాడు. 1920 నాటి అతని వ్యాపారానికీ, 1922 నాటి దానికీ రెట్టింపు తేడా కన్పిస్తుంది-ద్రాక్షలలోనూ, ఆహారపదార్థాలలోనూ. చట్టసమ్మతమైన వ్యాపారిగా చక్కని లాభాలు గడిస్తున్నాడు. కాని యింతకంటే ఎక్కువచేసే అవకాశం వుందని చూశాడు. తన దగ్గర ఎలాగా ద్రాక్షలున్నాయి. తనే సారా ఎందుకు చేయకూడదు ?

సారాయి తయారుచేయాలని ఏరోజు నిశ్చయించు కున్నాడో ఆనాటి నుంచీ అతని దొంగసారాయివ్యాపారం అపారంగా పెరిగిపోయింది. తనదగ్గిర వున్న సారా తన దగ్గిర వున్న ఆర్డర్లన్నిటికీ సరిపోదు. ఇంకా ఎంతో కావలసి వుంటుంది. రోజుకి రోజూ ఈ అక్కర పెరిగిపోతూంది. అతనికి టైమూ, కావలసిన పరికరాలూ కూడా లేకపోవడంతో, ఒక ప్రణాళిక తయారుచేశాడు. పల్లెటి ప్రాంతాలలో వున్న తన స్నేహితుల్లో కొంద రీపని తనకి చేసిపెడతారు. తను ద్రాక్షలు సరఫరాచేస్తాడు. ఏమీ అభ్యంతరం చెప్పకుం డానే సారాయి తయారుచేశారు. కాని ప్రతి నూరుగాలన్ల లోనూ కొన్ని గాలన్లు తాము అట్టేపెట్టుకునేవారు. ఒక ఆరునెలలు గడిచేసరికి ఓ అరడజను సెల్లాబట్టీలు తయారై ప్రతిఆరువారాలకీ పీపాలకొద్దీ సారా తయారుచేస్తున్నాయి.

సెల్లా బాగా డబ్బు సంపాదిస్తున్నాడు. ఎంతో సంతో షంగా వున్నాడు. 1923 నాటికి అతని వయస్సు నలభై ఒకటి. అమెరికాలో పదిహేడు సంవత్సరాలనుంచి వుంటు న్నాడు. నాల్గోవంతు మిలియను డాలర్లు సంపాదించాడు.

కాని, డబ్బు ఎక్కువ వస్తూన్నకొద్దీ యింకా ఎక్కువ సంపాదించాలన్న తృష్ణ పెరిగింది. ఒక పౌను మాంసంమీద ముప్ఫయిశాతం లాభం చాలా తక్కువగా తోచసాగింది. అదే – గాలను సారామీద ఐదువందల శాతం లాభం కన బడుతూంది. ఆహారపదార్థాల వ్యాపారంలో శ్రద్ధ తగ్గి పోయింది. క్రమేపీ దీన్ని మానేసి జొన్నసారా తయారు

చేయడం మొదలుపెట్టాడు. 1923 నాటికి ద్రాక్షసారా తయారుచేస్తూన్నవి వంట సారా తయారు చేస్తున్నాయి. గాలనువంటసారా ముప్ఫయి డాలర్లకి గుత్త బేరంమీద అమ్మడం ప్రారంభించాడు. చాలా మంచిసరుకు – నిషా ఎక్కువ. అలాంటి విషయా లెప్పుడూ అశ్రద్ధచేయడు సెల్లా.

గుత్తబేరంలో దొంగసారా అమ్మడంతో పూరుకోక – చిల్లరఅమ్మకంకూడా ప్రారంభించాడు. ఎన్నో వినోద కేంద్రాలు ప్రారంభించాడు: చక్కని ఇటాలియనుపేర్లతో– క్లబ్ లిడో, క్లబ్ రోమా, క్లబ్ నపోలీ. పొగాకూ సోడాలూ అమ్మడం అన్న పేరువెనుక వంటసారా అమ్ముతూవుండే వారు. ఇంకా లోపల జూదం ఆడడానికి హంగులన్నీ అమర్చి వుండేవి. వీటిలో రెండుమూడుక్లబ్బులు భోజనంకూడా పెట్టేవి. చాలా చక్కగా వ్యాపారం సాగుతూంది.

అతని ప్లానుప్రకారం సర్వరక్షణలూ వున్నాయి అతనికి. బట్టీలు పెట్టుకుని పనిచేసేవారు వేరు – వారికి లాభాలలో భాగం యిచ్చేవాడు. ప్రతిక్లబ్బూకూడా దాన్ని మేనేజిచేస్తూన్న వ్యక్తిపేరనే వుండేది. అతనికీ లాభాలలో భాగమే వస్తూండేది. ఎవరేనా పోలీసులకి చిక్కితే–సెల్లాయే అయినఖర్చునంతా భరించేవాడు – జైలుశిక్షగాని పడితే – అలా జైలుకి వెళ్ళినవాడికి రోజు కింతచొప్పున యిస్తూండే వాడు. ఈపనిలోకి తీసుకొనేటప్పుడే షరతులు నిఖార్సుగా తేల్చుకునేవారు. సెల్లా ఎప్పుడూ వాటిని కాదనలేదు. అక్కడ పనిచేసేవారికి తా మేం చేస్తున్నామో తెలుసు.

ఆ ప్రమాదాలకు సంసిద్ధులయే వచ్చేవారు వారు. ఇలాగ ఏ ఒక్కరూ బాధ్యులు కానట్టుగా నడిచేది వ్యాపారం. ఇదే రోజుకి రోజూ సెల్లాని ధనవంతుణ్ణి చేస్తూంది.

1926 చలికాలంలో ఇటలీలో వున్న తన యిద్దరు మేనల్లుళ్ళకి-రాబర్టో, మార్కో-సెల్లాలకి ఉత్తరం రాస్తూ, అమెరికా వచ్చి తనకి పనిలో సహాయం చేయమని రాశాడు.

"మీ కొక్కొక్కరికి మూడువందల డాలర్లు యిస్తాను నెలకి. దీనికి తోడుగా, వుచితంగా యిల్లూ భోజనం యిస్తాను. నా కారు వుపయోగించుకోవచ్చు. చక్కగా పెద్ద మనుషులలా బట్టలు వేసుకుని రోజుకి కొద్దిగంటలసేపు నాక్లబ్బుల్లో ఒక దానిలో పని చేద్దురుగాని. నాక్రింద ఎంత కాలం పనిచేస్తారో అంతకాలమూ, సంవత్సరానికి మూడు వేల డాలర్లు నిల్వ చేసుకుంటారు."

గ్యాడోయే రాబర్టో, మార్కోల చదువుసంధ్యల కోసం ఖర్చుచేశాడు. పందొమ్మిది, యిరవై ఏళ్ళ వయస్సులో పనిలోకి దిగారు. ఒకడు టీచరు. రెండోవాడు ఫ్లారెన్సులో ఇళ్లకి ప్లానులు తయారుచేసేవాడు. వీరినిచూసి గ్యాడో చాలా గర్వపడేవాడు.

రాబర్టో, మార్కోలు గ్యాడోదగ్గిర వుద్యోగంలో చేరడానికి వచ్చారు. తాము ప్రేమించిన ఆడపిల్ల లున్నారు. తాము అసహ్యించుకున్న స్నేహితు లున్నారు. ఇటలీలో

భవిష్యత్తు బాగానే వుండేది. బాధ్యత గల యువకులైన వారు తమ వృత్తులు వదలిరావడానికి కొంచెం జంకారు. కాని మూడువందల డాలర్లు, ఉచితమైన వసతి, కారు–ఇవన్నీ ఐశ్వర్యవంతుల తరగతికి ఆహ్వానంగా తోచాయి. అందు కనే కాదన లేకపోయారు. కాని ఎటువంటి జీవితంలో అడుగు పెడుతున్నారో వూహించుకోలేకపోయారు. సెల్లాకి మటుకు తెలుసా – తన మేనల్లుళ్ళని ఎక్కడికి తీసుకుపోతున్నాడో?

వారిద్దరూ ఒక సంవత్సరానికి పైగానే సెల్లాక్లబ్బులలో పనిచేశారు. ఒకనాటి సాయంత్రం రాబర్టో సెల్లాను పక్కకు పిలిచి, ఇటలీకి తిరిగి పోతున్నామని చెప్పాడు.

"ఇక్కడ బాగా లేదా?" – ఆశ్చర్యంగా అడిగాడు సెల్లా.

"నిజంగానే – వచ్చిన రోజునుంచీ మేం యిద్దరం చాలా దుఃఖిస్తూనే వున్నాం. నిన్నూ, నీభార్యనీ అవమానించినట్టవుతుందని జంకాము. చక్కగా మాకన్నీ అమర్చావు...మా జీవితంలో యింత సుఖం అనుభవించి ఎరుగం. డబ్బుచేసుకుందుకు అవకాశం యిచ్చావు. వీటన్నిటికీ మేం ఎప్పుడూ కృతజ్ఞులమే. కాని ఈ పనిలో యిష్టం పోయింది. మమ్మల్ని వెళ్ళిపోనీయి."

"తప్పకుండా వెళ్ళండి. కాని మీరు యిక్కడికి రావడానికి కారణం నేను కనుక మీరు చెప్పేది వింటే బాధగా వుంది. అసలు కష్టం ఎక్కడ వచ్చింది?"—అడిగాడు గ్యాడో.

"మా అయిష్టానికి కారణం నువ్వని అనుకోకూడదు. నువ్వు రమ్మని ప్రోత్సహించిన మాట నిజమే. మా ప్రయాణానికి నువ్వే పెట్టుకున్నావు. పనిలో పెట్టావు. కాని నువ్వూ, మేమూ కూడా యిదంతా మామంచికే అనుకోవడం జరిగింది. కాని అది పొరపాటని నిశ్చయంగా తేలిపోయింది."

"అయితే తప్పక వెళ్లిపోవడానికే నిర్ణయించుకున్నారా?"

"ఇందాకా చెప్పానుకదా! మా కభిరుచి పోయింది. నీ అభిరుచి యిక మేం పంచుకోలేము. నీ స్నేహితులు, నీ సంస్థలు మా కభిమతం కాదు. మాపనిలోని చిన్నతనాన్ని, సిగ్గుచేటుని యిక భరించలేం. మేం బ్రతికే ఈ వాతావరణం అంతా సత్యదూరం; మాకు దుఃఖం కల్గిస్తూంది. నువ్వుకూడా పూర్తిగా నాశనం కాకముందు వెనుతిరగడం మంచిది" అన్నాడు రాబర్టో.

"పోనీ, గియనిట్టా పెళ్ళిదాకానైనా ఆగకూడదా? అప్పుడంతా కలసే యిటలీ వెళ్ళిపోయే విషయాన్ని గురించి ఆలోచించుకోవచ్చు." అన్నాడు సెల్లా.

"అలాగే అనుకున్నాం! నిజానికీ వినోదం చూడకుండా వెళ్ళలేకపోదుం—ఎందుకంటే, ఆమెను మళ్ళీ చూస్తానో లేదో. కాని పరిస్థితులు విషమించాయి. ఆమెను సుఖమైన చోట యిచ్చి పెళ్లి చేస్తున్నావన్న నమ్మకం లేదు మాకు. ఆమెను బలిచేస్తున్నావు. మా కా వివాహం

చూడ్డం యిష్టం లేదు. గినో పిలోసీది నీ కూతురికి రెట్టింపు వయసు. మర్యాదస్థుడు కాదు. ఆ పెళ్ళికూడా నువ్వు అను కున్నది. అవునా?''

''నా కూతురిని గురించి బాధపడకు. గినో చాలా మంచివాడు; బోలెడు ధనం వుంది.''

''అతనికి డబ్బుందని మాకూ తెలుసు. కాని నువ్వను కున్నంత మంచివాడయితే బాగానే వుండును. మా కా పెళ్ళి యిష్టంలేదు. అది చూడ్డం అసలిష్టం లేదు. అయితే యీ షరతుకి వుంటాం - నువ్వు పెళ్ళిఅవగానే యీ వ్యాపారం అమ్మేసి ఇటలీకి వచ్చేస్తానని ప్రమాణం చేస్తే అప్పటిదాకా వుంటాం.''

''అలా అని నిశ్చయంగా చెప్పలేను'' అన్నాడు గ్యూడోసెల్లా.

''అయితే యీ నెలాఖరున మేం వెళ్ళిపోతాం'' అన్నాడు రాబర్టో.

1920 సంవత్సరం మధ్యదాకా కూడా గ్యూడోసెల్లా సుగుణవంతుడైన భర్తగా, తండ్రిగా రాణించాడు. ఫుడ్ స్టోరు విజయవంతంగా జరిగిన రోజులలోనే యిల్లు కొన్నాడు. విశాలమైన భవంతి అది.

ఓ డజను సంవత్సరాలపాటు ఈ యిల్లు కళాకాంతు లతో వెల్లివిరిసింది. సంతోషమైన పిల్లలూ పెద్దలూ ఆ యింట తిరిగారు. గ్యూడో చాలా సరదాఅయిన వాడు.

ఒక్క రోజుకూడా సాయంత్రం యిల్లు వదలి బయటికి పోయి ఎరుగడు. పిల్లలతో ఆడుకుంటూ తాను తొలుత అమెరికాకు వచ్చిన రోజులలోని వింతలు కథలుగా చెప్తూండేవాడు. ఎందరో స్నేహితులు వచ్చి పోతూండేవారు. సుష్ఠుగా తినిపోతూ వుండేవారు. ఆడవారుకూడా గెల్సొమీనాతో కూర్చుని, కుట్టుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ, కాఫీ తాగుతూ కాలక్షేపం చేసేవారు.

దొంగసారావ్యాపారంలో పూర్తిగా మునిగేదాకా గ్యాడో సాంఘిక జీవితం అలా గడిచింది. కాని యితని చట్టవ్యతిరేకపు వ్యాపారం పెరగడంతో యితని స్నేహితులు మారేరు. వారి సంఖ్యకూడా పెరిగింది. గాంగు కాలంనాటి స్నేహితులతో కాలక్షేపం చేయడానికి టైము లేదు. వారిస్థానే – ఈ రోజుల్లో–స్థానికపోలీసు అధికారులు, యితర ఉన్నత అధికారులు ఆక్రమించారు. వీరి అవసరం ఎంతైనా వుంది సెల్లాకి. వారికి వారు చేసిన సహాయానికి డబ్బివ్వడమే కాకుండా యింట్లో విందుభోజనాలు పెట్టించేవాడు. వారంతా గెల్సొమీనా వండే చక్కటి భోజనాలు, వంటకాలు యిష్టపడేవారు. గెల్సొమీనా, యితరస్త్రీలూ కలిసి తమ భర్తలకీ, వారి ముఖ్యస్నేహితులకీ చక్కని వంటలు వండి వడ్డించేవారు. ఇలా చేయడం వారి విధి అని నమ్ముతారు యిటాలియను స్త్రీలు.

ఎప్పుడూ యింట్లో త్రాగడం వుంది. యుద్ధానికి ముందు దొరికే సారాతో ప్రారంభించి భోజనానంతరానికి

సెల్లా తన స్వంత స్టాకులోనివి తెచ్చియిచ్చేవాడు. కొంతసే పయేసరికి ఏం తాగుతున్నామో తెలియని స్థితిలోకి దిగి అక్కడివారు సభ్యతను కూడా మరిచి ప్రవర్తించేవారు.

సెల్లా అంత త్రాగేవాడు కాదు. భోజనంతోటీ, తర వాత కొంచెం తాగేవాడు. కాని పోలీసు అధికారుల వత్తిడి కాదనలేకపోయాడు. వారితోపాటు తనూ తాగడం మొదలు పెట్టాడు.

ఇలాగ గ్యాడో తన సరుకు మంచిదని నిరూపించ డాని కన్నట్టు తాగడం మొదలుపెట్టాడు. ఇది ప్రస్తుతజీవిత విధానం కావడంతో తాగడం మానలేదు సరికదా-తప్ప త్రాగి తనూ సభ్యత మరిచిపోయాడు.

ఈ పార్టీలకి ఒక్కొక్కరు తమ స్నేహితురాళ్ని కూడా తెచ్చేవారు. ఈవిడస్నేహం డబ్బుకి వస్తుంది. వీరూ దొంగసారాయివ్యాపారిపనిలో భాగమే. ఎవరికి ఎక్కువ డబ్బుంటే వారి స్నేహంకోసం పోటీపడేవారు. ఇలాంటిస్త్రీలు. బాగా తాగివున్న సమయంలో వీరు యిట్టే చేతులుమారేవారు. గెల్సుమీనా, యితరస్త్రీలూ ఈ ప్రవర్తనను అసహ్యించుకునేవారు. కాని ఏమీ అనే వారు కాదు. నిశ్శబ్దంగా పడివుండడం పురుషులు వీరికి నేర్పిన విద్య.

ఇలాంటి ఒక పార్టీలోనే సెల్లా తొలిసారిగా ఒక పరాయిస్త్రీని ముద్దుపెట్టుకోవడం సంభవించింది. కాని యిది గెల్సుమీనా చూస్తూండగా జరిగింది. ఆక్షణంలో తన

భర్త కనులలో చూసిన కాంతికి భయపడింది గెల్సుమీనా. ఈ భయంనుంచి ఆమె తేరుకోనేలేదు.

ఈలోపునే ఎఫ్‌బిఐవారు సెల్లాకోసం వుచ్చులు పన్నుతూనే వున్నారు. దొంగసారావ్యాపారం చేస్తున్నాడని తెలుసు వారికి. కాని అది నిరూపించడానికి నిదర్శనాలు దొరకలేదు. మే 1929 లో చివరికతణ్ణి పట్టారు. ఆశ్చర్యం ఏమిటంటే—అప్పుడు అతను చేయని తప్పుకి పట్టుపడ్డాడు!

గియనిట్టా వివాహం యింకోసంవత్సరం వుందనగా గ్యాడోసెల్లా కొన్న ఒక వ్యాపారం అతని నాశనానికి హేతువయింది. ఒక చౌకబారు హోటలు కొన్నాడు. దీనిలో రెండుగదులు తనకని చక్కగా తయారుచేయించుకున్నాడు. ఒకగది ఆఫీసు; రెండోది విశ్రాంతికి. సాయంత్రం యింటికి వెళ్ళేపాటి టైము చిక్కకపోతే వుండడానికి. మిగిలిన డజను రూములదాకా దొంగసారావ్యాపారులకి, జూదగాళ్ళకి, వ్యభిచారులకి అద్దెకిచ్చేవాడు.

ఈ హోటలు కొన్న సమయంలో సెల్లా పూర్తిగా దొంగసారావ్యాపారిలాగా, అలాంటివారితోనే కాలక్షేపం చేయడం ప్రారంభించాడు.

ఇతడూ, యితని పోటీదారులూకూడా రాజకీయపు ఒత్తిళ్ళలో పడి, చట్టవిరుద్ధమైన చర్యల పట్ల అధికారుల ఒత్తిడికూడా పెరిగి, వీరికి యిళ్ళవిషయం పట్టించుకునే అవకాశాలుకూడ తగ్గిపోయాయి. కొందరు తమ పిల్లలని

బోర్డింగుస్కూళ్ళలో పెట్టేశారు. కొందరు డబ్బుఇచ్చి వారి సంగతే మరిచిపోయేవారు. జీవితం అంతా తాగుడువినో దాలతో గడిపేయడం-తినడం, తాగడం, జూదం ఆడడం అంతే. ఎంత సులభంగా డబ్బు గడించేవారో, అంత తెలిః తక్కువగా దాన్ని ఖర్చుచేసేవారు. రోడ్ల వెంబడి, వూరు బయట వారు తిరిగే కార్లు చాలా పెద్దవి. మెరుస్తూవుండేవి. తరుచు వీటిని దేనికో కొట్టించేసేవారుకూడా. ధరించే దుస్తులు ఖరీదైనవి. వజ్రపుటుంగరాలు, టైపిన్నులు ధరించుతూ వుండేవారు. జేబులనిండా డబ్బు. ఒకరి క్లబ్బులకి ఒకరు వెడుతూ, వారి వెనుకగదులలో పేకాడుతూవుండేవారు. నూరూ, ఏభయి డాలరు బిల్లులు ఈ పేకాటబల్లలమీద ఐదూపదిసెంట్లు పేపరుకోసం విసరినంత సులువుగా పడేసే వారు.

తనతోటి వ్యాపారస్థులతో యిలాంటి జీవితం గడుపుతూ, సెల్లా కూడా పూర్తిగా యింటిసంగతే పట్టించుకోవడం మానేశాడు. తరుచు యింటికి భోజనానికి రావడం తగ్గించేశాడు. అక్కణ్ణుంచి నెమ్మదిగా రాత్రంతా యింటికీ రావడం మానేయడం ప్రారంభించాడు. ఏదో ఓక్లబ్బులో వుండవలసివచ్చిందనో, భోజనంతరవాత అలసి పడుకుని నిద్రపోయాననో సాకు చెప్తుండేవాడు. నిజమేమిటంటే! మిల్డ్రెడ్ సెల్లర్స్‌తో వుండిపోయేవాడు!

సెల్లాహోటలులోనే యీమిల్డ్రెడ్ సెల్లర్స్ వ్యభిచార వ్యాపారం సాగించేది. చాలా ఖరీదైన యువతి యీమె.

ఈమెకి తోడుగా యింకో ఆరుగురుఅమ్మాయిలు వుండే వారు. ఆమెకూడా కొందరు ప్రముఖులతో వుంటూవుండేది. ఒక్క రాత్రికి ఐదువందల డాలర్లు యివ్వగల్గినవారితో వుండిపోయేది.

పాతికసంవత్సరాలు దాటిన యువతి సెల్లర్స్. ఈవ్యాపారంలో ఎంత దిట్ట అంటే, ఒక్క మధ్యాహ్నం ఆమెతో కలిసిమెలిసివుంటే, యింకెవరూ పనికిరారు. ఆమే కావాలి అంటారుట కాతాదారులు!

ఈమెపద్ధతులు పైశాచికంగా తోస్తాయి. ఎక్కువ కీర్తి, డబ్బూ వున్న గ్యాడోసెల్లాను ముందు జయించు కుంది. బహిరంగంగా అతని స్నేహితురాలిగా మసలసాగింది. ఈ సాకుతో మిగిలిన కాతాదారులదగ్గర ధరలు పెంచేది. ఈఆట బహునేర్పుగా ఆడడంతో, రెండుసంవత్సరాలు గడిచే దాకా, సెల్లర్సను యితరులతోపాటు తనూ పంచుకుంటున్నా నన్న సంగతే తెలియలేదు - గ్యాడోకి! ఇంకోనలుగు రీమెకు కాతాదార్లున్నారు. వీరిలో యిద్దరు సెల్లాకు పోటీ వాళ్ళు. ఇంకోడికి వ్యాపారపుపను లున్నాయి సెల్లాతో. ఇక నాల్గోవాడు - తన స్వంత అల్లుడు గినోపినోలీ. గినో పినోలీ రహస్యంగా కోరుకుంటూ వుండేవాడు—ఎప్పుడో ఒకప్పుడు సెల్లర్సుని స్వంతంగా తనే వుంచుకుంటా నని.

1929 లో సెల్లర్సుకి వ్యాపారంలో కొత్త అమ్మా యిలు కావలసివచ్చారు. కాలిఫోర్నియాలోనుంచి తేవాలని

నిశ్చయించుకుంది. మిల్డ్రెడ్ గ్యూడోని అడిగింది—తన పెద్ద కారులో సాన్ ఫ్రాన్సిస్కోకి తీసుకువెళ్ళమని.

వెళ్ళి చక్కని హోటల్లో బసచేశారు. చివరిదాకా అనుకున్నట్టు అన్నీ జరిగాయి. గ్యూడో డబ్బు నీళ్ల ప్రాయంగా కర్చుచేశాడు. మిల్డ్రెడ్ ఎంతో ఉదారంగా ప్రవర్తించింది.

చక్కగా వున్న ముగ్గురు యువతులను వెనుక సీటులో కూర్చోపెట్టుకుని యింటిముఖం పట్టారు - సెల్లా, మిల్డ్రెడ్. కాలిఫోర్నియాహద్దు దాటారో లేదో-ఓ నల్లని పెద్దకారు తరుముకునివచ్చి బలవంతంగా వీరి కారు ఆపించింది.

అది ఎఫ్‌బిఐవారి కారు. వ్యభిచారనిమిత్తం రాష్ట్ర సరిహద్దులను దాటించి యువతులను తీసుకుపోతున్నా రన్న నేరంపై గ్యూడోనూ,మిల్డ్రెడ్‌నూ బందీలుగా తీసుకున్నారు. గినోపిలోసీ కావలసిన వివరాలన్నీ చెప్పాడు.

అధికారులకి సెల్లా నెలాగేనా జైల్లో పెట్టాలనే వుంది. అయినాకూడా తెలివైన అతని న్యాయవాదు లతన్ని రక్షించివుందురు. వీరికి కావలసిన దంతా ఒక్కటే-అతనీవిషయంలో దోషి కాదనీ, యీవ్యాపారంలో అతని కేం సంబంధంలేదనీ మిల్డ్రెడ్ వాఙ్మూలం యిస్తే చాలు. కాని సెల్లర్సు తనని తను రక్షించుకుందామనుకుంది; కష్టపెట్ట

కుండా వుండే పక్షంలో గ్యాడో, తనూ భాగస్థులుగా యీ వ్యాపారం నడుపుతున్నాం అని చెప్పింది.

అక్టోబరు 1929 లో గ్యాడో కేసువిచారణ జరిగింది. శిక్షార్హుడుగా నిర్ణయించడం జరిగింది. చాలాసంవత్సరాల జైలుశిక్ష పడింది.

1952 లో గ్యాడో స్నేహితుడు ఆర్మండో గ్రిల్లీ - ఉత్తరపసిఫిక్ రైలురోడ్డు పనిలోనుంచి విరమించుకున్నాడు. పించను తీసుకున్నాడు. తన డెబ్బయవపుట్టిన రోజు ఘనంగా జరుపుకున్నాడు. ఇడాహోలో తన స్వంతయింట్లో వుంటున్నాడు. ఆ పుట్టినరోజునాడు పద్ధెనిమిదిమంది భోజనానికి వున్నారు. బల్లనిండుగా వంటలూ, పిండివంటలూ అమర్చి వున్నాయి. ఆ లేత చేపలు అతనుపట్టినవి. ఆ కూరగాయలు అతని తోటలోనివి. ఇంటినిండా లోటులేమి కన్పిస్తూనేవుంది. ఉత్తరందిక్కుగా పళ్ళచెట్లూ, కూరగాయల తోటా వుంది. దక్షిణాన పూలతోట. ఇంటివెనక చెవులపిల్లులకు స్థలం. కోళ్ల గూళ్లు. కర్రలూ బొగ్గూ వుంచుకొనే స్థలం వుంది.

బల్లచుట్టూ ఆర్మండో, అతని భార్య, ముగ్గురు పిల్లలూ వారి కుటుంబాలూ, ఐదుగురు మనుమలూ వున్నారు. వారికి తోడుగా ఎందరో స్నేహితులు వున్నారు. వారికి అమెరికాకు వచ్చిననాటినుండి తెలుసు ఆర్మండో. వారిలో ఒకరు భోజనానికి కూర్చుంటూ "గ్యాడో సెల్లా కూడా యిక్కడ

వుండివుంటే...సంతోషించే తత్వం పూర్తిగా పోగొట్టుకోకుండా వుండివుంటే యిలాంటి సమయంలో ఎంతో సరదాపడేవాడు. మనలో ఒకడుకదా గ్యూడో సెల్లా'' అన్నాడు విషాదం ధ్వనించే కంఠస్వరంతో.

ఆర్మండో విచారం, అసహ్యం విదితంచేస్తూ తల విదిల్చాడు...

''ఆరునెలల క్రిందట చూశాను అతణ్ణి. ఒంటరిగా అసహ్యంగా వున్న ఒక స్థలంలో కూర్చుని ముష్టివాళ్లకి సారాయి అమ్ముతున్నాడు. అది చాలా చిన్నస్థలం. చచ్చిన యీగలు, అసహ్యమైన కిటికీలు-ఆ కిటికీ అద్దంమీద - 'పొగాకు-సోడాలు' అని రాసివుంది...1920 లలో అతని క్లబ్బులకి కూడా యిదే గుర్తుగా వుండేది...అతని ముఖం ఎర్రగా వుంది. చర్మం మచ్చలు పడింది. పళ్ళు వూడిపోయాయి. ముక్కు విపరీతంగా పెద్దదిగా తోస్తూంది. వెనుక ఒక గదిలో చిన్న కుక్కిమంచం, ఓ చిన్నబల్ల, పొయ్యి వున్నాయి. అదే సెల్లాయిల్లు. చాలామటుకు ఈ ప్రపంచంలో వుండకుండా తాగిపడివుంటాడని చెప్పగా విన్నాను .... నిజమే—చివరికి అంతే కాబోలు - అంటూ ముగించాడావ్యక్తి. ఓక్షణం నిశ్శబ్దంగా వుండి ''గ్యూడో ఒకసారి నాకు చూపెట్టిన ఉత్తరం జ్ఞాపకం వచ్చింది నాకు...అతని తల్లితండ్రులు రాసినది - వార మెరికాకు ఎందుకు రాలేదో వివరిస్తూ. దానిలో ఒక వాక్యం నా

కళ్ళకు కట్టినట్టుంది. "మాకు కష్టాలే అర్థం అవుతాయి. దారిద్ర్యం, బాధ అర్థం అవుతాయి. కాని ఐశ్వర్యం, సుఖజీవితం అర్థం కావు. వూహించుకోలేముకూడా. మాలో ఈ ఐశ్వర్యాన్నెదుర్కొనే శక్తి లేదు నాయనా, లేదు-"

ఆర్మండో, డెబ్బయిసంవత్సరాలు వచ్చినా ఆరోగ్యంగా వున్నాడు; అర్థం పర్థం లేని ఆలోచనలతో బాధపడడు. ముఖంమీాద ఆలోచనాపూర్వకమైన చూపుమటుకు నిలిచింది—"అవును-అలాగే అయుండచ్చు, అవవచ్చు-" అన్నాడు నెమ్మదిగా...

